జనరంజక గ్రంథావళి-2



# గ్రామీణ పారిశ్రామికీకరణ

రచయిత

డాక్టర్ ఆర్. వి. రావు

హైదరాబాదు





తెలుగు అకాడమి

హైదరాబాదు

1978

Popular Series: graameeNa paariSraamikiikaraNa (Rural Industrialization).
*Author :* Dr. R. V. Rao. *First Published,* 1978; pp. viii+108.



*First Published,* 1978
*Copies*: 1, 000

Published by TELUGU AKADEMI, Hyderabad 500029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



PRICE: RS. **1–75**

Printed in India
Cover at Replica, Hyderabad–500 020
xt at Boys Town I. T. C., Jahanuma, Hyderabad–500 253
Andhra Pradesh

# భూమిక

ఇంటర్మీడియట్, డిగ్రీతరగతులకు అవసరమైన పాఠ్య, పఠనీయ గ్రంథాలను, అనువాద వాఙ్మయాన్ని, మోనోగ్రాఫ్‌లను ఇంతవరకు తెలుగు అకాడమి ప్రచురించి విద్యార్థుల, అధ్యాపకుల, విద్యావేత్తల ఆదరాభిమానాలను విశేషంగా చూరగొన్నదని వేరే చెప్పనక్కర్లేదు. అయితే అంతటితో తన బాధ్యత తీరినట్లుగా అకాడమి భావించడంలేదు. కొత్తగా చదువు నేర్చుకొన్న వారికి, పాఠ్య ప్రణాళికలతో నియత విద్యా రంగంతో (formal education field) సంబంధం లేకుండా జ్ఞానోపార్జన చేయదలచిన వారికి, విద్యార్థులకు అధ్యాపకులకు, ఈ జనరంజక గ్రంథావళి వల్ల ప్రయోజన ముంటుందని భావిస్తున్నాము. నిత్యజీవితంతో సన్నిహిత సంబంధమున్న వివిధ శాస్త్రాంశాల విజ్ఞానాన్ని, సమకాలీన సమస్యల, పరిష్కారాల పరిజ్ఞానాన్ని అందించే సదుద్దేశంతో, సరసమైన ధరలకు ఈ గ్రంథాలను వెలువరిస్తున్నాము. ప్రయోజనాత్మకమైన తెలుగు సదస్సు సిఫార్సుల మేరకు ఈ గ్రంథాల ప్రచురణ చేపట్టినాము. వివిధ రంగాలలో ప్రాయోగికానుభవంగల నిపుణులను రచయితలుగా ఎన్నుకొన్నాము. భాష సరళంగాను, అందరికీ అర్థమయ్యే రీతిలోనూ, సాధ్యమయినంత తక్కువ సాంకేతిక పదజాలంతో ఉండేటట్లు తగిన శ్రద్ధ తీసుకొన్నాము. ఈ గ్రంథాలు అందరి ఆదరాభిమానాలకు పాత్రమౌతాయని ఆశిస్తున్నాము.

విమర్శకులు సహృదయంతో ఇచ్చే సూచనలు పునర్ముద్రణలో తప్పక పరిశీలించగలము.

# ఉపోద్ఘాతం

ఆధునిక విజ్ఞానాన్ని, వ్యాప్తిచేసే ఉద్దేశంతో సామాన్య పాఠకులకు అర్థమయ్యే రీతిలో తెలుగు అకాడమి. జన బాహుళ్యానికి ఆసక్తికరమైన విషయాల మీద, జనరంజక గ్రంథావళిని ప్రచురించాలని, నిర్ణయించటం శ్లాఘనీయమైన విషయము. ఈ శ్రేణిలో ఉన్న, గ్రామీణ పారిశ్రామికీకరణ అనే పుస్తకాన్ని వ్రాయమని కోరినారు. ఈ విషయంలో కొన్ని సంవత్సరాలు గాంధీజీతో వర్ధాలో పనిచేసే భాగ్యం నాకు కలిగింది. పారిశ్రామిక శాఖలో కూడ జాయింట్ డైరెక్టర్‌గా, కుటీర పరిశ్రమ అభివృద్ధికి తోడ్పడే అవకాశం కలిగింది. అనేక గ్రంథాలుకూడ వ్రాయడం జరిగింది. అంతేకాక ఆంధ్ర, ఆంధ్ర వ్యవసాయ, మైసూరు, ఇతర విశ్వవిద్యాలయాలలో గ్రామీణ పారిశ్రామికాభివృద్ధికి సంబంధించి, ప్రత్యేక ఉపన్యాసాలుకూడా ఇచ్చినాను. పారిశ్రామికీకరణ, గ్రామాభివృద్ధికి, తద్వారా దేశాభివృద్ధికి తోడ్పడుతోంది. ఈ నాడు నిరుద్యోగసమస్య పరిష్కారం చేయాలన్నా, గ్రామ గ్రామాలలో పేదరికబాధ పోగొట్టాలన్నా గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి శరణ్యము. ఈ పుస్తకం వ్రాయటానికి, ఈ అవకాశం ఇచ్చిన తెలుగు అకాడమికి నా కృతజ్ఞతలు.

# విషయసూచిక

# 1

# గ్రామ పునర్నిర్మాణము

భారతదేశంలో, గ్రామాలు చాలా ఉన్నాయని, అనాదినుంచి భారత ప్రభుత్వం, గ్రామసీమల అభివృద్ధికి పాటుపడేదని చరిత్రకారులేకాక, భారతదేశానికి వచ్చిన యాత్రికులుకూడ వారి రచనలలో వ్రాసినారు. భారతదేశానికి స్వాతంత్ర్యం రావటానికిముందు గాంధి, రవీంద్రనాథఠాకూరు మొదలైన నాయకులు గ్రామాల అభివృద్ధికి, ఎంతో తోడ్పడినారు. ఒకసారి గాంధిజీ గ్రామాల అభివృద్ధి, యువకుల పాత్ర గురించి చెబుతూ, "గ్రామాలకుపోయి, అక్కడి ప్రజల కార్యక్రమాలలో పాటుబడి ఉండండి. వారికి యజమానులుగా, లేదా వారిని ఓదార్చేవారిగా పోకండి. వారి దైన్యసేవకులుగా ఉండి, వారి అభివృద్ధికి పాటుపడండి. వారు ఏమి చేయవలెనో చెప్పండి. మీరు రోజు అనుసరించే కార్యక్రమంనుంచి, వారు జీవితంలో ఏ పద్ధతులు అవలంబిస్తే మంచిదో తెలుసుకొనేటట్లు చేయండి" అన్నాడు. ఈ విధంగా రవీంద్రనాథఠాకూర్, ఇతర క్రైస్తవ సంస్థలు, గ్రామసీమల అభివృద్ధికి చాలా తోడ్పడినాయి.

మనం ప్రణాళికలు అమలు జరపటంలో ఒక ప్రాంతాన్ని అభివృద్ధి చేయటంలో, గ్రామీణ అభివృద్ధి పథకాలకు అంటే గ్రామీణ పేదవారి అభివృద్ధికి గొప్ప విలువ ఇవ్వడం జరుగుతోంది. నిరుద్యోగ సమస్య, తక్కువ పని అవకాశాల సమస్య, పేదరికంబాధ, పరిష్కరించేసి అభివృద్ధి లక్ష్యం, సాంఘిక న్యాయానికి సమన్వయం చేయటమే వాటి పరమ లక్ష్యము. అభివృద్ధి సమగ్రంగా జరగవలె. ఒక్క వ్యవసాయం విషయంలోనే మనం నిమగ్నులై ఉండకూడదు. వికేంద్రీకరణమైన గ్రామీణ పరిశ్రమలకు కూడ కూడలి స్థానం యివ్వవలె. దానితో వ్యవసాయ కూలీలకు, సన్నకారు రైతులకు తదితరులకు పని అవకాశాలు ఇవ్వవలె. వివిధ రంగాల మధ్య సమైక్యత తేవలె. అంటే భారత గ్రామీణాభివృద్ధి పథకాలలో వ్యవసా

యానికి, ఉపాధి సౌకర్యాలకు, గ్రామీణ పారిశ్రామికీకరణకు గొప్ప ప్రాధాన్యం ఇవ్వవలె.

అభివృద్ధి, తరవాత సాంఘికన్యాయం అనటానికి బదులు, అభివృద్ధి సాంఘికన్యాయానికి అని గుర్తించవలె. మొదట అభివృద్ధి, తరవాత సాంఘిక న్యాయం అనటం న్యాయంకాదు. రెండంటిని సమన్వయించేసి మనం పని చేయవలె. అభివృద్ధి గణాంక లెఖ్ఖలతో చెప్పటంతో, గ్రామీణ ప్రజలు నిజస్థితి మనకు తెలియదని, గత 30 సంవత్సరల నుంచి మనకు గల అనుభవం నుంచి తెలుస్తూఉంది.

గ్రామాల ప్రజలను పీడిస్తున్న, నిరుద్యోగ సమస్య, పేదరిక బాధలను నివారించవలె. ఈ సమస్య ఎంత తొందరగా పరిష్కారం చేస్తే అంత మంచిది. వ్యవసాయ అభివృద్ధి 5 శాతమైనా కావలె 8-10 శాతం పారిశ్రామికాభివృద్ధి కావలె ప్రణాళికా లక్ష్యాలలో కూడా తగు మార్పులు రావలె. కేంద్రీకరణంవల్ల అంతగా లాభాలు రావు ఆహారం, వస్త్రాలు, ఇండ్లు, విద్య, ఆరోగ్యం మొదలైన విషయాలు, గ్రామ పంచాయితీలకు అప్పచెప్పవలె. వారి ప్రణాళికలు అమలు జరపుకోటానికి, కావలసిన సాంకేతిక, ధనసహాయం ప్రభుత్వం చేయవలె. గ్రామసీమలు వారికి కావలసిన వనరులు వారు వెచ్చించుకోవచ్చు. వీటితో వారికి కావలసిన ఆహారధాన్యాల్యు, పంచదార, నూనె, మొదలైనవి వారు తయారు చేసికోవచ్చు. బ్లాకు స్థాయిలో తగు సాంకేతిక సహాయం జిల్లా స్థాయిలో నాయకత్వం వహించిన బాంకు ధనసహాయం లభించవలె. జిల్లా కాలేజిలలో అర్థశాస్త్ర ఉపన్యాసకులు, సహకర సంఘాలు, నిర్మాణ కార్యకర్తలు, స్వచ్ఛంద సేవా సంస్థలు, చేదోడు వాదోడుగా కలసి పని చేయవలె

అభివృద్ధి కార్యక్రమాలు, ఉపాధి సౌకర్యాలు ఇచ్చేవిగా ఉండవలె. ఎంతమందికి ఉపాధి సౌకర్యాలు ఇవ్వగలము అంటే, అది ఉత్పత్తి మీద, మనం అవలంబించే పద్ధతుల మీద ఆధారపడుతుంది. సాంకేతిక పద్ధతులు, ఉపాధి సౌకర్యాలు ఇచ్చేవిగా ఉండవలె.

ప్రణాళికలలో వ్యవసాయానికి ప్రాధాన్యం ఇవ్వవలె. అది చేయ్యక పోయినందువల్లనే, మనం ఈనాడు కష్టపడుతూన్నాము.

5 శాతమైన, వ్యవసాయం అభివృద్ధి కావటమే కాక, వ్యవసాయ దారులకు కావలసిన వనరులు సరఫరా అయ్యేటట్లు చేయవలె. వనరులు-అంటే నీటి పారుదల, ఎరువులు, నాణ్యమైన విత్తనాలు, పనిముట్లు, మొదలైన సౌకర్యాలు. శాస్త్రీయ వ్యవసాయ పద్ధతులు-ఇప్పటి వరకు ధనిక రైతులకు మాత్రమే దొరకుతున్నాయి. 78 మిలియన్‌ల వ్యవసాయ దారులలో 58 మిలియన్‌ల సన్నకారు రైతులున్నారు. వారిని మనం దృష్టిలో ఉంచుకొని, పారిశ్రామిక విషయంలో, మనం అనుసరించే పద్ధతులను ప్రజలకు నచ్చేటట్లు, వ్యవసాయం విషయంలో కూడ, ఒక పథకాన్ని తయారు చేయవలె. మన పారిశ్రామిక విధానంలో తగు మార్పులు రావలె. పరిశ్రమలు వికేంద్రీకరణం చేసి, గ్రామీణ పరిశ్రమలు అభివృద్ధి చేసి, నిరుద్యోగ సమస్య పరిష్కారం చేయవలె. కుటీర పరిశ్రమలలో తయారు చేయ కలిగే సరుకులు, చిన్న పరిశ్రమలు చేయకూడదు. చిన్న పరిశ్రమలు చేయ కలిగే సరకులు, పెద్ద పరిశ్రమలు చేయరాదు. ఉత్పత్తి, సామాన్య ప్రజలే చేయవలె. వారి కోసం ఇతరులు చేయ నక్కరలేదు.

భారత దేశానికి, వైశాల్యం హెచ్చు గల దేశాలలో 7 వ స్థానం ఉంది. జన సంఖ్యలో చూస్తే, భారత దేశానికి రెండవ స్థానం ఉంది. 1975 లో, మన జనభా 598 మిలియన్‌లు ఉందని అంచనా వేయడం జరిగింది. మన దేశం, బహు విశాలమైనది. 37,87,7820 చతురపు కిలో మీటర్ల వైశాల్యం ఉంది. ఈదేశానికి 1971 జనాభా లెక్కలప్రకారం, భారత దేశంలో 5,75,936 గ్రామాలున్నాయి. 2643 పట్టణాలున్నాయి. గ్రామాలలో 50 శాతానికి పైగా, 500 కు మించి జనాభా లేదు. 1975 లో 29 శాతం మాత్రమే చదువు వచ్చిన వారు. 1951 తో పోల్చిచూస్తే, గొప్ప అభివృద్ధి సాధించినాము అనవలె. ఎందుచేత నంటే 1951 లో 16 శాతానికి మాత్రం, చదవటం వ్రాయటం వచ్చేది. దేశం అభివృద్ధి చెందాలంటే, ఇది సరిపోదు. మన దేశం ఆర్థిక జీవితం, ఇప్పటికీ వ్యవసాయం మీదనే ఆధారపడి ఉంది.

1971 లో గ్రామీణ ప్రజలు 430.8 మిలియన్‌లు, ఉండే వారు. వారిలో పని వాళ్ళు 148.4 మిలియన్‌లు-అంటే 33.8

శాతం వ్యవసాయ దారుల లో 52 శాతం భూమి సాగు చేసి జీవించే వారు. 31 శాతం వ్యవసాయ కూలీలు. 3 శాతం చేపలు పట్టి, అడవులు, పెంపుడు జంతువులు పెంచి జీవించేవారు. 14 శాతం గనులలోను, ఉత్పత్తిలోను, వ్యాపారంలోను ఉండేవారు.

భారత దేశంలో, వ్యవసాయం తదితర వృత్తులు 75 శాతానికి పైగా, ఉపాధి సౌకర్యాలు ఇస్తాయి. 50 శాతానికి మించి జాతీయాదాయానికి తోడ్పడుతున్నాయి. పెద్ద పరిశ్రమలకు-ముఖ్యంగా జనపనార, బట్టలు, చక్కెర, నూనె గింజల కార్ఖానాగారాలకు-ముడి పదార్థాలు సప్లయ్ చేస్తున్నాయి. కొంతగా, విదేశీ ఎగుమతులకు కూడ తోడ్పడుతున్నాయి. వ్యవసాయదారు సేద్యం చేసే పొలం యొక్క సరాసరి వైశాల్యం 2.30 హెక్టర్లకు మించటం లేదు. 70.75 మిలియన్‌ల పొలాలలో, 50 శాతం పొలాల విస్తీర్ణం 1 హెక్టర్ మించటం లేదని అంచనా వేయబడింది

దేశంలో ఈనాడు 2,19,821 గ్రామ పంచాయితీలు న్నాయి. 460.8 మిలియన్ ప్రజలు పంచాయితీలలో ఉన్నారు. పంచాయితీ రాజ్ స్థానిక స్వపరి పాలనా విధానం, గ్రామ, బ్లాకు జిల్లా స్థాయులలో 1959 లో ప్రభుత్వం ప్రవేశపెట్టింది.

ఇంతమంది గ్రామసీమలలో ఉన్నా, యిప్పటి వరకు వారి అభివృద్ధికి తగిన చర్యలు మనం తీసికోలేదు. 215 మంది ప్రజలు పేదరికంబాధలో మునిగి తేలుతున్నారు. అందుచేతనే అనేక అంతర్జాతీయ సంస్థలు, భారతీయ ఆర్థిక శాస్త్ర వేత్తలు, గ్రామీణ పేదరికం, ఆర్థికాభివృద్ధికి అడ్డు వస్తోన్నదని ఘంటా పథంగా చెప్పటం జరిగింది.

సంఘంలో న్యాయం చే కూర్చటానికి, గ్రామీణ అభివృద్ధి పథకాలు, ప్రభుత్వం, స్వచ్ఛంధ సేవా సంస్థలు అమలుజరిపినాయి. సన్నకారు రైతుల అభివృద్ధి పథకాలు, గిరిజన అభివృద్ధి పథకాలు. ఆయకట్టు అభివృద్ధి పథకాలు, క్షామనివారణ సౌకర్య పథకాలు ఇంకా ఎన్నో ఎన్నో పథకాలు ప్రభుత్వం అమలుజరిపింది. కాని

వాటి మధ్య సమన్వయం లేక పోవటంతో, రావలసిన లాభాలు రావటంలేదు. ఈనాడు సమన్వయ గ్రామీణాభివృద్ధి పథకాలకు గొప్ప ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. నాణ్యమైన విత్తనాలు, ఎరువులు, సరఫరా చేయటంతో గ్రామీణ పేదరికంపోదు.

గ్రామీణ ప్రాంతాలలో జీవిస్తూ, పేదరికం బాధ అనుభవిస్తూన్న, వారికి సాంఘిక, ఆర్థిక అవకాశాలు ఇవ్వవలె. సమన్వయం చేయబడిన ప్రాంతీయ అభివృద్ధి పథకాల ద్వారానే, ఈ పని చేయటానికి వీలుంది. ఇవన్నీ జిల్లా స్థాయిలో సమన్వయం చేయవలె. గ్రామీణాభివృద్ధి కార్యక్రమాల ముఖ్యోద్దేశం గ్రామీణ ప్రజల జీవితంలోమార్పు తెచ్చి, అక్కడి ప్రజల అందరి సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడటమే.

గ్రామాభివృద్ధి చేయాలంటే, ఒక పద్ధతి ప్రకారం శాస్త్రయుక్తంగా, అన్ని జాతీయ వనరులు ఉపయోగించి, ప్రతి వ్యక్తి ఒక సంఘానికి ఉపకరించేటట్టి, ఉత్పత్తి పెంపొందచేసే వృత్తిలోని మగ్నుడై ఉండి, దానివల్ల సంపాదించే రాబడి, కనీస కోరికలు నెరవేరేటట్లు అయినా ఉండవలె. వ్యవసాయ పరిశ్రమలకు సంబంధించిన సముదాయాలను (Complexes) నెలకోల్పవలె దానితో ప్రజలకు ఉపాధిసేకరణలు వస్తాయి. ఇది జయప్రదం కావాలంటే ఎక్కడ ఏ వనరులు లభిస్తాయో తెలుసుకోవలె. జిల్లా స్థాయిలో ప్రణాళికలు తయారు చేసినా, అవి మొదట గ్రామీణ స్థాయిలో తరవాత బ్లాకు స్థాయిలో, అమలు జరపవలె అంటే గ్రామీణస్థాయిలో లభ్యమయ్యే వనరులను పట్టి ప్రణళిక తయారుచేసి, బ్లాకుస్థాయి, ప్లానుతో కలపాలె. అట్లాగే, బ్లాకుస్థాయి పథాకాలు, అన్ని క్రోడీకరించి, జిల్లాస్థాయి పథకంతో సమన్వయం చేయవలె. ఏస్థాయి లోనైనాసరే, ప్రణాళికల రచన స్థానిక వనరులపై ఆధారపడవలె. పట్టణాలలోని పథకాలు, పరిశ్రమలు గ్రామసీమలలో, ముందు చూపులేకుండా ప్రవేశపెట్టరాదు. గ్రామీణ ప్రజలకు తగిన సాంకేతిక విజ్ఞానాన్ని ప్రవేశపెట్టవలె. గ్రామీణ ప్రజలు దానిని అమలు జరపడానికి అంగికరించవలె. దాని వల్ల ఎవరికి పని సౌకర్యాలు పోకూడదు. వారి

ఆదాయం పెరగవలె. జీవిత స్థాయి కూడ మెరుగుపడవలె. వనరులు పరిపూర్తిగా ఉపయోగించటంలో అందరు కలసి పనిచేయవలె.*

భారత ప్రభుత్వం, పారిశ్రామిక, వాణిజ్య సంస్థలు గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలు చేపడితే, ఆ కార్యక్రమానికయ్యే ఖర్చు, రాబడి పన్నులోనుంచి తీసివేస్తున్నారు. దానితో కొంత మంది అయినా, గ్రామాభివృద్ధి కార్యాక్రమాలకు తోడ్పడవచ్చు.

ఇప్పటికి ప్రణాళికలు అమలు జరుపుకోవటం మొదలు పెట్టి 27 సంవత్సరాలు దాటినా, దారిద్ర్యబాధలో ఉన్న పేదప్రజలకు, వారి కనిసపు కోరికలు నెరవేరటానికి అంతగా మనం చేయలేకుండటం చాల శోచనీయము. పట్టణాలలోని 40 శాతం జనసంఖ్య, గ్రామ సీమలలోని 50 శాతం జనసంఖ్య అతి పేదరిక బాధలో ఉన్నారు. వారికి కావలసిన కనీసపు వస్త్ర సౌకర్యంగాని, గృహ సౌకర్యం గాని లేకున్నది. గ్రామీణ పేద ప్రజల జనసంఖ్య ఈనాడు భారత దేశంలో 1921 ని జనాభా అంటే 222 మిలియన్‌లకు మించి పోయింది. అంటే వారి జనసంఖ్య రెష్యా జనాభామించింది. గ్రామీణ ప్రజల పేదరికంబాధ, జనసంఖ్య విపరీతంగా పెరగటం, వ్యవసాయ ఉత్పత్తి సామర్థ్యం తగ్గటం. నిరుద్యోగ సమస్య, పూర్తిగా పని అవకాశాలు లేక పోవటం, ప్రజలు అవలంబిస్తోన్న వృత్తులలో మార్పులు లేకుండటం మొదలైనవి.

భారతదేశంలో సామాజికాభివృద్ధి పథకాలు ప్రవేశపెట్టి, సంస్థల ద్వారా, గ్రామీణాభివృద్ధి పథకాలు అమలు జరపటానికి ప్రయత్నం చేసినాము. ప్రజాప్రభుత్వ వికేంద్రీకరణ పద్ధతులు అమలు జరిపినా, గ్రామీణ ప్రజలలో చాల మందికి, కనీసపు సౌకర్యాలన్నా ఇవ్వలేక పోయినాము. నిజంగా ఆలోచిస్తే గ్రామాల ఆర్థిక వ్యవహారాలకు, పట్టణాల ఆర్థిక వ్యవహారలకు ముడిపెట్టకూడదు. గ్రామాలు పట్ట ణాలపై ఆధారపడరాదు, పారిశ్రామికంగా తలపెట్టే కార్య

* The entire programme is based on the twin principles of optimum resources utilisation and task adoption by appropriate authorities.

క్రమాలు గ్రామసీమలలో లభ్యమయ్యే వనరులపై ఆధారపడవలె. వ్యవసాయం పరిశ్రమలు ఒకదానిపై ఇంకొకటి ఆధారపడవలె. మనం తల పెట్టిన కార్య క్రమానికి, లక్ష్యాలు ముఖ్యంగా గుర్తు పెట్టుకోవలె. ప్రాంతీయ ప్రణాళికా రచన, అభివృద్ధి కేంద్రాలు, ఒక ప్రాంతంలో ఉన్న గ్రామీణ సమూహం (Cluster villages) ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని చేయవలెనే కాని, పట్టణాలలో కూర్చొని, గ్రామీణాభివృద్ధి పథకాలు తయారుచేయకూడదు.

1872 నుంచి, వివిధ పనులలో నిమగ్నులైన వారి శాతంలో అంతగా చెప్పుకోదగిన మార్పులు రాలేదు. 72 శాతం వ్యవసాయం తదితర వృత్తులలోను, 10 శాతం పరిశ్రమలలోను, 18 శాతం ఉద్యోగాలలోను స్థిరపడినారు కాని వ్యవసాయంమీద ఆధారపడే వారి శాతంలో తగ్గటంకాని, పరిశ్రమలలో నిమగ్నులైన వారి శాతంలో హెచ్చుదలగానిలేదు. అభివృద్ధి చెందుతోన్న, చెందిన దేశాలలో ఇట్లా జరగలేదు. క్రమక్రమంగా వ్యవసాయం, తదితర వృత్తులమీద ఆధారపడే వారి సంఖ్య తగ్గటం, ఇతర రంగాలమీద ఆధారపడే వారి సంఖ్య పెరగటం జరిగింది. మన ప్రణాళికల కాలంలో, పెద్దఎత్తున పెద్ద పరిశ్రమల అభివృద్ధిలో పెద్ద పెట్టుబడి ఖర్చు కావట , ఎక్కువ కార్మికులకు ఉపాధిసౌకర్యాలు కలుగటం, వారికి ఎటువ టి లాభం లేకపోవటం జరిగింది. చాల మంది పెద్ద పరిశ్రమలు చా. మందికి ఉపాధిసౌకర్యాలు ఇస్తాయంటారు. ఇది సత్యంకాదు. విపరీతంగా జనాభా పెరుగుదల, హెచ్చుమంది భూమిమీద ఆధారపడటం భారత గ్రామీణ దృశ్యంలో, విషాద విషయం అని శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయ అర్థశాస్త్రశాఖా ధ్యక్షులు, గ్రామీణాభివృద్ధిపై చర్చలు జరిగిన గోష్టిలో చెప్పిన మాటలలో చాలా సత్యమ ంది. భారతదేశ ప్రణాళికా రచన కారులు, ప్రభుత్వం చేసిన కూడారాని అపరాధం, ఈ సమస్య అర్థం చేసుకొని పరిష్కారం చేయకుండటం అని మనం తప్పనిసరిగా భావించవలె.

ఇప్పటి మాదిరిగా మన జనాభా 2. 48 శాతం పెరిగితే, 30 సంవత్సరాలలో 1250 మిలియన్‌లు అవుతుందని అంచనా వేయ డం జరిగింది.అందువల్ల గ్రామసీమలలో కుటుంబ నియంత్రణ పథ కాలు ప్రవేశ పెట్టవలె.

ఇక వ్యవసాయం గురించి వ్రాస్తే, భారతదేశం యొక్క ఆర్థికవ్యవస్థలో దానికి కీలక స్థానం ఉన్నదని చెప్పవచ్చు. దేశంలో చాల మందికి ఉపాధి సౌకర్యాలు కలగ చేయటమే కాక, ముఖ్య పరిశ్రమలకు ఇది నాంది అని, విదేశ మారకం కూడ లభ్యమయ్యే టట్లు చేస్తుందని, దానితో సన్నిహిత సంబంధంగల పశుపోషణ, పాడి పరిశ్రమ కోళ్ల పెంపకం, కూరగాయల ఉత్పత్తి, వ్యవసాయ దారులకు ఉపవృత్తులు కలగచేసి, హెచ్చు ఆదాయం వచేటట్లు చేయడమేకాక, ప్రజలకు అనుబంధ ఆహారం లభ్యమయ్యేటట్లు చేస్తునాయి.

భారత వ్యవసాయం దేశపు ఆర్థికవ్యవస్థలో కూడలి స్థానం కలిగి ఉన్నా, దాని అభివృద్ధి విషయంలోను, దానితో బాటు, దీనితో జతపడిన గ్రామాభివృద్ధిలో మనం తగు శ్రద్ధ చూపలేక పోయినాము. వ్యవసాయానికి, గ్రామాభివృద్ధికి, ఇప్పుడు భారత ప్రభుత్వం గొప్ప విలువ ఇస్తోంది. సుమారు ౬లక్షల గ్రామాల పున ర్నిర్మాణం జేయడం చాల కష్టమైన పని. ఇదివరకు, ఈ విషయాన్ని మరచినాము. ప్రజాభిప్రాయాన్ని కూడ ఈ విషయంపై మరల్చ వలె. ప్రజలకు ఈ విషయం అర్థమయ్యేటట్లు చేయవలె. శాస్త్రీయ దృష్టితో మనం, అందరిని కూడగట్టుకొని, పరిష్కారం చేయటానికి ప్రయత్నం చేయవలె.

ఈ మధ్యనే, భారత వ్యవసాయ ప్రదర్శనం జరిగే సందర్భం లో, ఒక సందేశంలో భారత ప్రధాని గ్రామీణాభివృద్ధి కార్య క్రమలు నడుపుకోగల శక్తిసామర్థ్యాలు, సాంకేతిక విజ్ఞానం మనలో వున్నవని, పరిశోధనల ఫలితాలు, ప్రజలు వారి కార్యక్రమాలలో ప్రవేశ పెట్టాలని, ప్రదర్శన పద్ధతి, రేడియో, తదితర మార్గాల ద్వారా, వీటి లాభలు గ్రామసీమల ప్రజలకు నచ్చచెప్పాలని అన్నారు. ప్రజలకు ఏ మార్గమైనా లాభధాయకమని తోస్తే, దాన్ని తప్ప కుండా అవలంబిస్తారని, ప్రభుత్వం వారికి మార్గదర్శకులుగా ఉండా లని వారు అన్నారు.

ఈ సందర్భంలో సందేశం పంపుతూ, భారత అధ్యక్షుడు నీలంసంజీవరెడ్డి గారు వ్యవసాయలలో శాస్త్రీయ పరిజ్ఞానాన్ని

ఉపయోగించి ఉత్పత్తి పెంచాలని, దీనివల్ల చాల మందికి ఉపాధి సౌకర్యం కలుగుతుందని అన్నారు.

మన అభివృద్ధికి, వ్యవసాయం ఎంతో సహాయకారి అవుతుంది. ఇదివరలో మనకు కావలసి దాని కంటె హెచ్చు ఉత్పత్తి చేసి వుంటే చాలా బాగుండేది. పెరుగుతున్న జనాభా శాతంతో, మన వ్యవసాయాభివృద్ధి కూడ జరిగితే బాగుండేది. వ్యవసాయదారు, గ్రామస్థుడు, మంచి పరిస్థితిలో ఉండిన నాడే, దేశం అభివృద్ధి దశలో ఉన్నదని చెప్పవచ్చు, వారి శ్రేయస్సు, అభివృద్ధి మీదనే దేశ శ్రేయస్సు కూడ ఆధారపడి ఉంది. అందు చేత వ్యవసాయాన్ని తగు రీతుల అభివృద్ధి చేయవలె. హెచ్చు భూమిని, సేద్యం కింద తీసుకోనిరావలె. ఒక ఎకరంలో హెచ్చు పంట పండించవలె. వ్యవసాయంలో ఉత్పత్తి పెంచటానికి, తగు వనరులు మనం ఇవ్వవలె. ఈనాడు భారత కర్షకుడు, ప్రభుత్వం తన యోగక్షేమాన్ని కోరుతుందని గుర్తిస్తున్నాడు. అతనికి కూడ గొప్ప భవిష్యత్తు ఉన్నదని, దేశ ఆర్థికవ్యవస్థలో అతడు కూడ భాగస్వామి అని ప్రభుత్వం గుర్తించిందని గర్వపడుతూన్నాడు.

వ్యవసాయాభివృద్ధి గురించి మనం ఇంకో విషయం కూడ గుర్తించవలె. సేద్యం కిందకు వచ్చిన భూమి 30 శాతం పెరిగింది నీటి పారుదల సౌకర్యాలు 60 శాతం పెరిగినాయి. ఆహార పంటలు, చెరుకు, పత్తి, జనపనారు ఉత్పత్తి రెట్టింపు అయింది. కాని ఒక సంవత్సరం బాగా ఉంటే, రెండు సంవత్సరాలు బాగా ఉండటం లేదు. మనం ఇంకా ఉత్పత్తి పెంచవలె సరఫరా అయిన ముడి సరకులు గ్రామీణ పారిశ్రామికీకరణలో ఉపయోగించి గ్రామాల సర్వతోముఖాభివృద్ధికితోడ్పడవలె.

మనం 142 మిలియన్ల హెక్టర్ల భూమిలో పంటలు పండిస్తున్నా, పల్లపు పంటలు అంటే, నీటి పారుదల సౌకర్యాలు గల భూవిస్తీర్ణం 32 మిలియన్ల హెక్టర్లు మాత్రమే-అంటే 22 శాతం అన్నమాట. భూప్రవాహాల నుంచి 72 మిలియన్ల హెక్టర్లు భూమి సేద్యం చేసుకోవచ్చు. మరి 32 మిలియన్ల హెక్టర్లు,

భూగర్భ జల వనరుల నుంచి సాగుచేసికోవచ్చు. అయినప్పటికి 30 శాతం మాత్రమే, ఉపయోగించుకొంటూన్నాము. నీటి పారుదల వనరులు పూర్తిగా ఉపయోగించుకున్ననాడే, వర్షాధారం మీద ఆధారపడనక్కరలేదు. భారత వ్యవసాయం, వర్షాధారంతో జూదం వంటి దంటారు.

వర్షాధారం చాల తక్కువగా ఉన్న దక్షిణాదిని, రాజస్థాన్ లోను, పంటల పద్ధతిలో మార్పు రావలె. శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం ఆర్థిక శాఖ యీ విషయంలో, వర్షా ధారం తక్కువ గల రాయలసీమలో సర్వేచేసి, ఇక్కడి మల్బరీ పంట చాల మంచి దని, దాని వలన సన్నకారు రైతులకు, మంచి లాభం వస్తుందని, మల్బరీ ఆకుతో పట్టు పురుగులు పెంచి, పట్టుకాయలు చేసి, దాని దారం అమ్మకంలో, రెండవ సంవత్సరం నుంచి, ఒక ఎకరం నుంచి, 5, లేదా 6 వేల రూపాయలు నికరాదాయం తీసికోవచ్చని, ఈ పంట, సన్నకారు రైతులకు కల్యాణ కల్పతరువనే, నిర్ణయానికి వచ్చినారు. మన రాష్ట్రంలో పట్టు చేనేత కేంద్రాలు ధర్మవరం, పోచం పల్లి, పెద్దాపురం తదితర ప్రాంతాలలో ఉన్నాయి. వీరికి కావలసిన సిల్కు దారం, మన రాష్ట్రంలోనే సరఫరా చేసుకోవచ్చు, చేనేత పనివాళ్ళు, సిల్కు దారంతో బట్టలు నేస్తే వారికి, రోజుకు 10 నుంచి 15 రూపాయల వరకు వేతనాలు వస్తాయి. ఈ పరిశ్రమ వ్యవసాయాభివృద్ధికి గ్రామీణ పారిశ్రామికీ కరణానికి, ఎంతో దోహదమిస్తుంది.

పంజాబ్, హర్యానా రాష్ట్రాలలో వ్యవసాయ అభివృద్ధి పథకాలు చాల జయప్రదంగా జరిపినారు. యువకులు, ఉత్సాహ వంతులు ఈ కార్యక్రమాలు చేపట్టినారు. వ్యవసాయాభివృద్ధితో పాటు, పారిశ్రామికాభివృద్ధి కూడ చేసినారు. దానితో ఈ రాష్ట్రాల లో, పట్టణ గ్రామీణ తేడాలు లేకుండా చేసుకొన్నారు. ఇది గొప్ప విషయం.

అభివృద్ధి కార్యకలాపాల కేంద్రాలు, ఆదర్శ ప్రాయంగా నడుస్తున్నాయి. సమైక్య గ్రామీణాభివృద్ధి పథకాలతో కొనగోలు

శక్తి గ్రామీణ ప్రాంతాలకు కూడ పోయింది. గ్రామాలలో పరిశ్రమలు స్థాపించటానికి యువకులు ఉత్సాహవంతులు ముందుకు వస్తున్నారు. ప్రభుత్వం కూడ వారికి కావలసిన సౌకర్యాలను యిస్తోంది. గ్రామ సీమలలోను, ఇతర ప్రాంతాలలోను పరిశ్రమలు, వ్యాపారం చేసే ఉత్సాహవంతులకు తగు సాంకేతిక విజ్ఞానం, తదితర సౌకర్యాలు పంజాబ్, హార్యానా రాష్ట్రాలలో విరివిగా లభిస్తున్నాయి. పంజాబ్‌లోని ప్రజలు, డబ్బు కూడ పొదుపు చేసు కొంటూన్నారు. అక్కడ ప్రజల డిపాజిట్లు హెచ్చుగా ఉన్నందున, కొన్ని ఇతర రాష్ట్రాలలో ఉపయోగిస్తున్నారు. ప్రజలు ఉత్సాహవంతులు. కష్టపడి పనిచేయగలరు. సాంకేతిక పరిజ్ఞానం చాలా బాగావుంది. జపాన్‌లో ప్రతి గృహం ఒక కార్మాగారం అంటారు. అట్లానే గ్రామ సీమలలో సహితం, గృహాలలో నేడు, ఇతర యంత్రాలు పనిచేయటం చూస్తే ఎంతో సంతోషం కలుగుతుంది. దానితో ప్రజలలో నిరుద్యోగ సమస్య రాదు. ఇది చాల గొప్ప విషయం ఈ విధంగా ఇతర రాష్ట్రాలలో కూడ పనిచేస్తే, గ్రామీణాభివృద్ధి పథకాలుఎంతో జయప్రదంగా జరప గలము.

ఆర్థిక ప్రణాళికల లాభాలు పొందాలంటే, అభివృద్ధి కార్యక్రమాల పర్యవేక్షణ గ్రామాల స్థాయివరకు తేవలె. తరవాత వాటి సమీకరణ చేయవచ్చు. జిల్లా స్థాయిలో ప్రణాళికలు ఉన్నా వాటికి అనుబంధంగా, ప్రాంతీయ ప్రణాళికలు కూడ చాల అవసరము. దానినే మైక్రో లెవల్ ప్లానింగ్ (Micro level planning) అంటారు. సమైక్యత గల ప్రాంతీయ అభివృద్ధి కార్యక్రమాలు, ఆయా ప్రాంతాల సాంఘిక ఆర్థికాభివృద్ధికి ఎంతో తోడ్పడగలవు. ఆర్థికాభివృద్ధికి పునాదిగా ఉండటానికి వీలుంది. అభివృద్ధి కేంద్రాలు, కేంద్రస్థలాలు, మనం గుర్తించి, వాటి అభివృద్ధికి, తగు సౌకర్యాలు ఇవ్వటానికి వీలుంది.

ప్రపంచ బాంకు, గ్రామీణాభివృద్ధి, గురించి కూడ కృషి చేసి, అనేక ప్రచురణలు కూడ చేసింది. 1975 లో ప్రచురించిన ఒక పుస్తకంలో, గ్రామీణ అభివృద్ధికార్యక్రమాల ముఖ్య లక్ష్యాలు పేర్కొన్నది. గ్రామీణ అభివృద్ధి ముఖ్యోద్దేశం, గ్రామీణ పేద

ప్రజల, సాంఘిక ఆర్థిక జీవితం మెరుగు చేయటమే, అభివృద్ధి కార్య క్రమాల వలన వచ్చిన లాభాలు, గ్రామాలలో జీవిస్తున్నా, పేద రికం బాధలో ఉన్న ప్రజలకు లభించేటట్లు చేయటమే. చిన్నతరహా వ్యవసాయ దారులు, రైతులు, భూమిలేని వారు, వీరందరు ఇక్కడ ఉన్నారు. గ్రామీణాభివృద్ధి పథకాలు అవలంబించటంలో కింది విష యాలు గుర్తించవలె (1) వ్యవసాయ ఉత్పత్తిలో, తక్కువ సామ ర్థ్యం గల వారిని, ఇతర గ్రామీణ పనులలో ఉండే తక్కువ సామ ర్థ్యం గల వారిని, ఇతర లాభ సాటి పనులలోకి తేవటంలో, అతి నెమ్మదిగా కృషి చేస్తున్నాము. (2) అభివృద్ధి చెందుతోన్న దేశాల లో గ్రామీణ ప్రజలు వివిధ రకాల పేదరిక బాధ అనుభవిస్తున్నారు. జనాభా ఇంకా విపరీతంగా పెరిగితే, వారు అధోగతి పాలవుతారు. (3) గ్రామీణ ప్రాంతాలలో, భూమి మీద ఆధారపడే కార్మికులు న్నారు. వారిని రోడ్లు వేయటంలోను, నీటి పారుదాల సౌకర్యాల లోను, పరిశ్రమలలో నూతన సాంకేతిక విజ్ఞానాన్ని తేవటంలోను ఉపయోగించవచ్చు.

పైన పేర్కొన్న సూచనలు బాగానే ఉన్నాయి. గ్రామీణ ప్రజలకు ముఖ్యంగా పేదరిక బాధలో మునిగి తేలుతున్న వారికి, ఆరోగ్యకరమైన ఆహార పదార్థాలు లభించేటట్లు చేయవలె. దానితో వారి ఉత్పత్తి సామర్థ్యం పెరుగుతుంది. జాతీయ ఆర్థికాభివృద్ధికి కూడ వీరు ఎంతో తోడ్పడ గలరు.

కనక గ్రామీణ అభివృద్ధి అంటే, ఒక్క వ్యవసాయం మాత్రం కాదు. అనేక రంగాలు దానిలో ఉన్నాయి. ఈ నివేదిక యింకో విషయాన్ని కూడ వెల్లడి చేస్తోంది. గత 30 సంవత్సరాల అనుభం పట్టి చూస్తే, హెచ్చు పెట్టుబడి గల సాంకేతిక విజ్ఞానం, ఆసియా ఖండంలోని సన్నకారు వ్యవసాయదారులకు, కుటీర పారిశ్రామికు లకు, సహాయ కారికాలేదు. వారు ఉపయోగించే పనిముట్లలోను, సాంకేతిక విజ్ఞానం లోను, పరపతి సౌకర్యాలలోను, ఉపాధి సౌక ర్యాలు పని అవకాశాలు పెంచగలిగేవిగా ఉండవలె. భూమి లేని వారికి తగు పని అవకాశాలు కలిగినవిగా ఉండవలె.

గ్రామీణ అభివృద్ధి పథకాలు, గ్రామీణ ప్రజల అభివృద్ధికి ఎన్నో విషయాలలో సహాయకారి కావలె. మొదటిది ప్రత్యక్షంగా ఉత్పత్తి పెంచే సాధనాలు, నీటి పారుదల, వ్యవసాయంలో నూతన పద్ధతులు అమలు జరపటం, పశు సంపద, ఎరువులు, గ్రామీణ పరపతి, సాంకేతిక విజ్ఞానం, గ్రామీణ పరిశ్రమలు, గ్రామీణ విద్యుచ్ఛక్తి పథకాలు మొదలైనవి. (2) నీటి సౌకర్యాలు, రోడ్లు (3) సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు ముఖ్యంగా గ్రామీణ విద్య, కుటుంబ నియంత్రణ మొదలైనవి. సమైక్యత గలిగిన గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో ఎన్నో తేవచ్చు-భూసంస్కరణలు, భూగరిష్ఠ పరిమితులు, యింకా ఎన్నో.

ఆర్థిక ప్రణాళికల రచనలో, మనం జిల్లా స్థాయిలో గ్రామీణాభివృద్ధి పథకాలు అమలుజరుపుకోవలె. కాని, గ్రామసీమల అభివృద్ధి కార్యక్రమాలు మొదట తీసుకోవలె. మహాత్మాగాంధి కూడ గ్రామీణ స్థాయినుంచి ప్లానింగ్ ఉండాలనేవాడు. ఈ ప్రణాళికలన్ని కోడీకరించవచ్చు. వాటన్నిటిని జిల్లాస్థాయిలో సమగ్ర దృష్టిలో పరిశీలన చేసి అమలు జరుపుకోవచ్చు. గ్రామస్థాయిలో గాని, జిల్లా స్థాయిలోగాని, స్వయంసంపూర్ణంచేయాలనే దృష్టితో మనం ప్రణాళికలు అమలు జరపకూడదు. వనరులు బాగా ఉపయోగించి, ప్రజలకు పని అవకాశాలు ఎట్లా ఇవ్వవలె అనే దష్టితో ఉండవలె. గ్రామీణ ప్రజల కనీసపు అవసరాలు ఎట్లా తీర్చగలము అనేవిషయాన్ని మనం పరిష్కారం చేసుకోవలె. సమైక్యత ప్రణాళికా రచనలో, జిల్లాస్థాయిలో అనేక ప్రయోగాలు చేయటానికి వీలుంది.

జిల్లాస్థాయిలో ప్రణాళికల రచన అయితే, గ్రామాల అభివృద్ధి కార్యక్రమాలకు గొప్ప విలువ ఇస్తాము. ప్రజల కోరికలు తీర్చే వస్తువుల ఉత్పత్తి, గ్రామీణ పని అవకాశాలు హెచ్చు అవుతాయి. గ్రామీణ పరిశ్రమల అభివృద్ధి పాడి అభివృద్ధి కోళ్ల పెంపకం, చేతి పరిశ్రమలు, సిల్కు పరిశ్రమ మొదలైన వాటికి ఎక్కువ విలువ ఇస్తాము. వీటితో గ్రామసీమలలోని ప్రజలకు ఉపాధిసౌకర్యాలు ఇవ్వటానికి ఎంతో వీలుంది.

ప్రజల సహకారం లేనిదే, గ్రామీణాభివృద్ధి పథకాలు జయప్రదం కానేరవు. ప్రజలు వీటిలో భాగస్వాములుగా ఉండవలె. ప్రణాళికా రచన క్రిందనుంచి రావాలని, ప్రజల కోరికలు మనం గుర్తించాలని అంటాము. సమైక్యతగల గ్రామీణాభివృద్ధి పథకాలు అమలు జరిపినట్లయితే, వీటన్నిటిని జిల్లా స్థాయిలో సరిగా ఆలోచించి సరిగ్గా కార్యక్రమాన్ని చూస్తే, ప్రజలకు హెచ్చు రాబడి మాత్రమే కాక, హెచ్చు ఉపాధి సౌకర్యాలుకూడ వచ్చేటట్లు చేస్తాయి.

వీటన్నిటిలోను మన ముఖ్య లక్ష్యం ప్రజల జీవిత స్తోమత పెంచటం, ప్రజావనరులను పూర్తిగా ఉపయోగించడం, గ్రామీణ ప్రజలు పొట్ట పట్టుకొని గ్రామాలు విడచి పట్టణాలకు ఉపాధికై రాకుండా చేయటం, వ్యవసాయోత్పత్తిని పెంచి, స్థానిక వనరులను ఆధారంగా చేసుకొని పరిశ్రమలు స్థాపించి, జనాభా పెరుగుదల అరికట్టినట్లయితే, గ్రామీణాభివృద్ధికి మనం ఎంతో చేయగలము.

ఈ సందర్భంలో ఇంకో విషయంకూడా గుర్తించవలె: గ్రామాభివృద్ధి కార్యక్రమాలు సఫలం కావాలంటే, అనధికారులు, సచ్ఛంధ సేవాసంస్థల సహాయం చాలా అవసరము. ప్రభుత్వ అధికారులు ఎంత చేసినా. అనధికారుల సహకారం కావలె. ప్రజలు ఈ కార్యక్రమం తమదిగా భావించవలె. అట్లా భావించాలంటే, ప్రణాళికల రచనలో స్థానిక ప్రజలు, నాయకుల సహకారం తీసుకోవలె. స్థానిక వనరులు గురించి, స్థానిక ప్రజలకు బాగా తెలుస్తుంది. వాటినివిని యోగించటంలో స్థానిక ప్రజలు ఎంతో సహాకరిస్తారు. స్థానికవనరులు ఉపయోగిస్తే, ఎన్నో కుటీర పరిశ్రమలు స్థాపించవచ్చు. గ్రామాలకు అనేక సౌకర్యాలు చేకూర్చవచ్చు. దానితో గ్రామాల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడవచ్చు.

సామాజికాభివృద్ధి కార్యక్రమాలు, భారత దేశంలో ప్రారంభమైనప్పటినుంచి గ్రామీణాభివృద్ది కార్యక్రమాలకు ప్రాముఖ్యం ఇవ్వడంజరిగింది. ఇవి నిజంగా గాంధేయ సిద్ధాంతలమీద అధారపడినాయి. గ్రామీణస్థాయి బ్లాకుస్థాయి, జిల్లా స్థాయిలో అనేక పథకాలు అమలు జరిపినారు. ఇవన్ని వికేంద్రీకరణ సిద్ధాంతంపై ఆధారపడి ఉన్నాయి. ఈ కార్యక్రమాలు అమలు జరపటంలో, ప్రభుత్వ

ముఖ్య ఉద్దేశం, ప్రజానాయకులకు, స్థానికంగా వారికి ఏమికావాలో తెలుస్తాయి. అందుకని అందరు ముందంజవేసి, గ్రామీణాభివృద్ధికి తోడ్పడతాతారు. అనధికారులకు గొప్ప స్థానం ఇచ్చినా, దురదృష్ట వశాత్తు, ప్రజల సహకారం విరివిగా రానందువల్ల, కులమత కక్షలు వల్ల, సామాజికాభివృధి పథకాలు అనుకున్నంత విజయం పొందలేదు.

మన అదృష్టవశాత్తు, భారత ప్రభుత్వం, ఈనాడు గ్రామీణా భివృద్ధి కార్యక్రమాలకు గొప్ప ప్రాముఖ్యం ఇస్తోంది. అందుచేతనే, ఈనాడు ప్రభుత్వంవారు, గ్రామాలలోని సహజ సంపదలు వినియో గించి, వికేంద్రీకరణ పద్ధతులపై ఉత్పత్తి సాగించి, ప్రజాసంస్థల సహకారం తీసుకోవాలని అపేక్షిస్తుంది. ప్రజాసంస్థలు, స్వచ్ఛంద సేవా సంస్థలు ఈ కార్యక్రమం జయప్రదం చేయగలరు. కొన్ని కొన్ని కార్యక్రమాలు ప్రజాసంస్థల చేతిలో పెడితే తక్కువ డబ్బు ఖర్చుతో, హెచ్చు పని చేయగలుగుతారు. అంతేకాక, ఆ కార్య క్రమాలు జయప్రదంగా జరుపుకోగలరు. దీని లాభాలు ప్రజలు పొందుతారు కనక వారికి వారు చేబట్టిన కార్యక్రమంలో ఎంతో శ్రద్ధ ఉంటుంది. అందుచేతనే గాంధీజీ నిర్మాణ కార్యక్రమానికి చాల విలువయిచ్చి, గ్రామీణ సర్వతోము ఖాభివృద్ధికి అనేక సంస్థలు, స్వాతంత్ర్యానికి ముందేస్థాపించి, గ్రామీణాభివృద్ధికి మార్గదర్శి అయి నాడు. ఈ విషయంలో ప్రజలుకూడ శ్రద్ధతీసుకోవలె. ప్రజాభి ప్రాయంఉంటే, ప్రభుత్వం చేబట్టిన కార్యక్రమాలు కూడ సరిగ్గా అమలు జరుగుతాయి. ప్రజలుకూడా మెళకువతో ఉండి, ప్రభుత్వ కార్యక్రమాల లోటు పాట్లను పైకితెచ్చి మంచి సలహాలు ఇచ్చి, ప్రభుత్వం, ప్రజలు కలిసి పనిచేస్తే ఎంతో బాగుంటుంది. ఆనాడు వారి స్వాతంత్రం కూడా నిలుస్తుంది. అందుచేతనే Harold J. Laski పండితుడు "Eternal vigilane is the price of liberty" అన్నమాట లలో చాల సత్యముంది.

వ్యవసాయం, పరిశ్రమలకు సన్నిహిత సంబంధం ఉంది. ఈ మధ్యనే ఢిల్లీలో వ్యవసాయ ప్రదర్శనాన్ని ప్రారంభించేస్తూ, ఈ ప్రదర్శనాలయం, వ్యవసాయం, దాని మీద ఆధారపడే పరిశ్రమలు, సాధించిన విజయాలు మనకు నిదర్శనంగా చూపుతోందన్నారు. స్వర్గీయ వల్లభాయి పటేలు, అతనికి ఒకే సంస్కృతి తెలుసునని, అది

వ్యవసాయం అని సగర్వంగా చెప్పేవారు. భారత దేశంలో, ప్రతీది వ్యవసాయంతో సంబంధం కలిగి ఉన్నది. దేశంలో వ్యవసాయం అభి వృద్ధి చెందవలె. ఉత్పత్తి పెరగవలె, ఉత్పత్తి విధాలు మెరుగు పడవలె అంతవరకు దేశానికి అభ్యుదయంలేదు. గ్రామీణ రంగం, ముఖ్యంగా వ్యావసాయ రంగంలో మార్పులు రావలె.

దేశాభ్యుదయానికి వ్యవసాయ పరిశ్రమలు 'చేదోడు వాదోడు' గా తోడ్పడతాయి. అనాదినుంచి భారతదేశంలో, కృషి, వాణిజ్యాలు, రెండు ప్రజల యోగ క్షేమానికి ఎంతో తోడ్పడేవిగా భావించేవారు. ఈనాడు కూడ వ్యవసాయ పరికరాలు పరిశ్రమకే సరఫరా చేస్తున్నాయి. అట్లాగే పరిశ్రమలకు కావలసిన ముడి సరకులు, వ్యవసాయం సరఫరా చేస్తోంది. వర్తకవ్యాపారాలు, ఉత్పత్తిదారు, వినిమోగదారుల మధ్య సన్నిహిత సంబంధం తెస్తాయి. భారత వ్యవసాయదారు హీనస్థితిలో ఉన్నా, దేశానికి కావలసిన ఆహారపంటలలో చాల శాతం అతడే పండించటం గర్వించ దగిన విషయము. అందువల్లనే ఈనాడు భారత ప్రభుత్వం కాల నియమం ప్రకారం, ఒక ప్రణాళిక ద్వారా భారత వ్యవసాయన్ని అభివృద్ధి చేయదలిచినారు దీనితోపాటు గ్రామీణ జీవితాన్ని కూడా మార్పు చేయవచ్చు. అంతేకాదు అనేకకుటీర చిన్న పరిశ్రమలు గ్రామసీమలలో ప్రవేశపెడితే, సన్నకారు వ్యవసాయ దారులకు, కుటీర పారిశ్రామికులకు హెచ్చు ఆదాయంరావడమేకాక, గ్రామల లోని ప్రజలు, ఉపాధి సౌకర్యాల కోసం పట్టణాలకురారు. దీనితో పాటు అక్కడ ఆరోగ్యం, నీటి సరఫరా ఇతర సమస్యలు మనం పరి ష్కారం చేయవలె.

వ్యవసాయం పరిశ్రమలు అభివృద్ధి చేయటంలో సమీకృత దృష్టి ఉండవలె. వచ్చే 10 సంవత్సరాలలో, భారత ఆర్థిక ప్రవృత్తి, తగుప్రయత్నాలు చేస్తే కొంత మెరుగు పడటానికి వీలుంది.

వ్యవసాయ సరకులు ఎగుమతి చేయటానికి చాలా వీలుంది.

అందుచేత మనమంతా కలసి, గ్రామీణాభివృద్ధికి సర్వదా తోడ్పడవలె.

# 2

# గ్రామీణ పారిశ్రామికీకరణ-దాని ముఖ్యోద్దేశం-భారత దేశపు ఆర్థిక వ్యవస్థలో దాని స్థానం

రోజు రోజు ప్రజలు గ్రామాలు విడిచి, పట్టణాలకు తరలి వస్తూన్నారు. ఈ ఒత్తుడి పట్టణాలు భరించలేకుండా ఉన్నాయి. భారత ప్రభుత్వం, ఈ సమస్యను గుర్తించి గ్రామీణ విస్తృత పారిశ్రామికాభివృద్ధి పథకాలు నెలకొల్పింది. కాని ఈ పథకాల ప్రయోజనాలు, గ్రామసీమలు పొందవలెనంటె, వీటి దృష్టిలో మార్పు చాల అవసరము. భారత ప్రజలను ఉద్దేశించి 4-4. 1977 రేడియోలో భారత ప్రధాని మొరార్జి దేశాయి గారు ప్రసంగిస్తూ "మన ఆర్థికాభివృద్ధికి, గ్రామాలు పునాదిగా భావించవలె. పేదరికపు బాధ ఇక్కడే హెచ్చుగావుంది. పెద్ద నగరాలు, పెద్దయంత్రాలు, పెద్ద శాస్త్రజ్ఞానానికి రావలసిన స్థానం, ఇదివరకే వాటికి వచ్చింది. కాని అవే అన్ని సమస్యలను పరిష్కారం చేస్తాయని భావించకూడదు" అని స్పష్టంగా చెప్పినారు. ఇంత స్పష్టంగా, ఏ యితర ప్రధానిగాని, ఆర్థిక శాస్త్రవేత్తగాని చెప్పలేదు. దానిలో చాల సత్యం ఉంది.

భారత దేశంలో 5.76 లక్షల గ్రామాలున్నాయి. మన 60 కోట్ల జనాభాలోను, 80 శాతం, గ్రామసీమలలో జీవిస్తున్నారు. జాతీయ ఆదాయనికి, గ్రామప్రాంతాలు 50 శాతనికిపైగా తోడ్పడు తున్నాయి. మన జనాభా విపరీతంగా పెరుగుతోంది. ఒక దేశం యొక్క ఆర్థిక రాజకీయ ప్రగతి, చాలవరకు ఆ దేశపు జనాభాపై ఆధార పడుతుంది. హెచ్చు జనభా వలన లాభాలు లేకపోలేదు. చాలమంది శ్రామికులుండటం, దానివల్ల జాతీయాదయం పెరగటం, దేశానికి కావలసిన అంగబలం ఉండటం మొదలైన లాభాలున్నా, నష్టాలే - ముఖ్యంగా ఆహారంకొరత, అనారోగ్యమూ, అవిద్య, నిరోద్యగం, మొదలైన వాటికి దారి తీస్తున్నాయి. జాతీయాదాయం, వనరుల పంపిణీ, తలసరి ఆదాయం మొదలైన వాటిపై

ఆధారపడి ఉంటుంది. ఇవన్నీ ప్రణాళిక కారచనకు చాల అవసరము. 1901 లో మన జనాభా 24 కోట్లయితే 1971 లోజరిపిన జనభా లెక్కల ప్రకారం, 56 కోట్ల వరకూ అనగా 150 శాతం పెరిగింది. అంటే సాలీనా మన జనాభా 1.5 శాతం నుంచి 2.5 శాతం వరకూ పెరుగుతూ వచ్చింది. మన దేశంలో జననాలరేటు 1000 కి 40 అయితే, మరణించే వారి సంఖ్య వెయ్యికి 18 మాత్రమే. ప్రణాళికల వలన మరణించే వారి సంఖ్య తగ్గించగలిగినాం కాని ,పుట్టేవారి సంఖ్య తగ్గించ లేకుండాఉన్నాము.

మన దేశంలో హెచ్చు శాతం ప్రజలు వ్యవసాయం మీదనే ఆధారపడుతున్నారు. అందుచేత చాల మంది భారత దేశాన్ని వ్యవసాయ దేశం అంటారు. నూటికి 73 శాతం వ్యసాయానికి సంబంధించిన వృత్తులపైన, 11 శాతం పరిశ్రమలకు, ఖనిజాలకు సంబంధిచిన వృత్తులపైనా, 6 శాతం రవణా తదితర వృత్తులలో 10 శాతం సేవలలోను ఉంది. మనదేశాన్ని ప్రపంచ లెక్కలలో ఆర్థికంగా వెనకబడిన దేశాలలో కలుపుతారు. దీనికి కారణం చాల మంది వ్యవసాయం మీద ఆధారపడటం, వ్యవసాయేతరరంగాలలో ముఖ్యంగా పరిశ్రమలలో అభివృద్ధి చెందకపోవటంవల్ల ఈ స్థితి వచ్చింది. ఆర్థికాభివృద్ధికి పరిశ్రమలే రాజబాట అనవలె మన దేశం వంటి వెనకబడ్డ దేశాలలో సాలుకు 4 శాతం మాత్రం నిలువయి పెట్టుబడిక ఉపయోగించ బడుతోంది. ఈ పెట్టుబడితో, ఘనమైన ఆర్థిక ప్రగతి సాధించలేం. ఆర్థిక ప్రణాళికలు జయప్రదం కావలంటే జనాభా పెరుగుదల దృష్టిలో వుంచుకోవలె. ప్రణాళికీ కరణంలో జనాభా పెరుగుదల, నియమిత వనరులపైనా, జాతీయోత్పత్తిపైన దాని ఫలితాలు మనం గుర్తించి, తగుచర్యలు తీసుకోవలె. ప్రణాళికల ద్వారా మరణించేవారి శాతం తగ్గిస్తే లాభంలేదు. పుట్టేవారి శాతం తగ్గించవలె లేకపోతే దేశంలో జనాభా హఠాత్‌వృద్ధి (Population explosion)ఏర్పడటం తటస్థిస్తుంది.

ప్రణాళికల ద్వారా ఆర్థికవ్యవస్థలో ఎన్నో మార్పులు వస్తాయి. వ్యవసాయ ప్రాబల్యంగల ఆర్థికవ్యవస్థలో క్రమేణా మార్పులు తెస్తాము. క్రమేణా పరిశ్రామికాభివృద్ధి అవుతున్నకొద్దీ,

గ్రామసీమల ప్రజలు జీవనోపాధికి, గ్రామసీమలు విడనాడి, పారిశ్రామికంగాను, వాణిజ్యానికి, అభివృద్ధి సంపాదించిన పట్టణప్రాంతాలకు తరలి రావటంలో గ్రామసీమలనుంచి తరలి వచ్చిన ప్రజల మనస్తత్వంలో మార్పువస్తుంది. వ్యవసాయంలో, పెద్ద కుంటుంబాలవల్ల లాభాలు ఉండేవుండవచ్చుకాని, పట్టణాలలో ఎదుర్కొనవలసిన సమస్యలవల్ల, చిన్నకుటుంబాలే చింతలేని కుంటుంబాలు అనిపిస్తుంది. అంతేకాకుండా పట్టణాలలో గృహావసతి లభించడం కూడా చాల కష్టము. మురికివాడలవల్ల విషవాయువువల్ల క్రిక్కిరిసి ఉండటంవల్ల సంఘంలో అనర్థాలు అనేకం కలుగుతున్నాయి. దీనినే అర్బన్ కేయాస్ (Urban chaos) అంటారు.

మన ఆర్థిక ప్రణాళికల ద్వారా విద్యా వైద్య ఆరోగ్య సౌకర్యాలు అనేకం మనం పొందినాము. దీనితో జననాలరేటు తగ్గింది. శిశుమరణాల రేటు 1931–1961 మధ్య వెయ్యికి 218 నుంచి 88 కి తగ్గింది. జీవిత పరిమాణం, 1952 లో 32 సంవత్సరాలు ఈనాడు 50 కి పైగా పెరిగింది. కుటుంబనియంత్రణ పథకాలు అమలుపెట్టడంజరిగింది, అంత లాభం లేక పోయింది. ఈ విధంగా జనాభా పెరిగితే, ఈ శతాబ్దం పూర్తి అయ్యేసరికి మన జనాభా వెయ్యి మిలియన్‌ల హద్దు దాటుతుందని అంచనాలు వేయడంజరిగింది.

1971 లెక్కల ప్రకారం, నూటికి 20 శాతం ప్రజలు మాత్రం పట్టణ ప్రాంతాలలో ఉన్నారు. 56 కోట్లలో 11 కోట్లు అని అర్థము. లక్షమంది కంటె హెచ్చువుండే పట్టణాలు 142 వున్నాయి. మొదటి 8 పట్టణాలలోను, మన ఆంధ్రప్రదేశ్ ముఖ్యపట్టణానికి 5 వ స్థానం ఉంది. ఇంగ్లాండ్‌లో నూటికి 79 పట్టణాలలో నివసిస్తున్నారు. కెనడా, అమెరికా, ఫ్రాన్స్ దేశాలలో కూడా 70 శాతం పైగా ప్రజలు పట్టణాలలో ఉన్నారు.

ఇప్పటి వరకు వ్రాసిన దానిని బట్టి మన 60 కోట్ల జనాభాలోను 80 శాతానికి పైగా గ్రామాలలో జీవిస్తున్నారని తెలుస్తుంది. జనాభా విపరీతంగా పెరుగుతోంది. మరణించే వారి సంఖ్య అరికట్టడం జరిగింది కాని పుట్టేవారిసంఖ్య అరికట్ట లేక పోయినాము. ప్రజలకు పని ఉండాలని మనం గుర్తించవలె. పని అవకాశాలు లేకపోతే, దేశంలో తీవ్ర పరిస్థితి ఏర్పడుతుంది. అందరికీ పని అవకాశాలు చాల

అవసరము. వ్యవసాయం అందరికీ పని అవకాశాలు ఇవ్వలేదు. భారత వ్యవసాయం చాల భాగం వర్షంమీద ఆధారపడుతోంది. దేశంలో కరువు ప్రాంతాలు నానాటికి హెచ్చవుతున్నాయి. మన రాష్ట్రంలో రాయలసీమలో చాల ప్రాంతలలో తక్కువ వర్షం పడుతుంది. అట్లాగే తెలంగాణా సర్కారులలో కొన్ని ప్రాంతాలలో బహు తక్కువ వర్షం పడుతుంది. ప్రభుత్వంవారు అక్కడి ప్రజలకు కావలసిన సదుపాయాలు, సాంకేతిక చర్యలు అంటే గొట్టపు బావులు తవ్వటం మొదలైన పనులు చేస్తున్నారు.

పెరుగుతోన్న జనాభ, ఒక వ్యవసాయం మీదనే ఆధారపడ లేదు. వ్యవసాయం అందరికీ ఉపాధి సౌకర్యాలు కలగ చేయటం కష్టసాధ్యము. అందుచేత పారిశ్రామికీకరణ ద్వారానే ప్రజలకు రాబడి, ఉద్యోగ అవకాశాలు, అభివృద్ధి తేగలుగుతాం. మిలియన్‌లు ఉద్యోగ అవకాశాలు లేక చాల కష్టపడుతున్నారు. పెద్ద ఎత్తున పారిశ్రామికీకరణ జరిగితేనే కాని ఈ సమస్యను పరిష్కారం చేయ లేము. వ్యవసాయేతర పనులలో ప్రజలు నిమగ్నులు కావలె.

గత 20 సంవత్సరాలలో, భారతదేశం ఘనమైన పారిశ్రామికాభివృద్ధి సాధించింది. 1951 తో పోల్చి చూస్తే, 1974 లో 274 శాతం సాధించినామని అంచనా వేయడం జరిగింది పెట్రోలియం సరుకులు, అల్యూమినియం సరకులు, ఎలక్ట్రికల్, తదితర యంత్ర సామగ్రి ఉత్పత్తి దీనికి చాల తోడ్పడింది.

మనకు కావలసిన పెట్టుబడి మన దగ్గర లేదు. భారతదేశం ప్రకృతి సంపద గల దేశము. కాని వాటిని మనం ఇప్పటివరకు ఉపయోగించుకోలేకపోయినాము. కనక పేదస్థితిలో ఉన్నాము. ఇక ముందు మన ఆర్థికవ్యవస్థలో మార్పురావలె. మన వనరులు కూడ గ్రామ సీమలలో ఉన్నాయి. కనక పారిశ్రామికీకరణలో మార్పురావలె. గ్రామీణస్థాయిని, స్థానికస్థాయిని పరిశ్రమలు అభివృద్ధిచేసి ఉత్పత్తి వికేంద్రీ కరణ చేయవలె. అంటే గ్రామీణ చిన్నతరహా పరిశ్రమలకు ఎక్కువ విలువ ఇవ్వవలె. సాంకేతిక విధానంలో మనకు అనువైన విధానాన్ని అవలంబించవలనే కాని పాశ్చాత్య విధానాలను గుడ్డిగా అనుసరించరాదు. మనదేశపు ప్రత్యేక పరిస్థితులు పెరుగుతోన్న జనాభాకు, ఉపాధిసౌకర్యాలు ఇవ్వవలసిన బాధ్యత

మనం గుర్తించవలె. కొన్ని కుటీర, చిన్న పరిశ్రమలు వంశ పారం పర్యంగా వస్తున్నాయి. కొన్ని కొత్తవి. చేనేత పరిశ్రమ అనాదినుంచి వస్తున్న కుటీర పరిశ్రమ ఎలక్ట్రానిక్స్ కొత్తపరిశ్రమ. రేడియోలు, టెలివిజన్ సెట్లు ఈనాడు చిన్న ఎత్తున చేయవచ్చు. అవి ఎదు ర్కొంటోన్న సమస్యలు ఎన్నో ఉన్నాయి పరపతి, తయారయిన సరకులకు మార్కెట్లు లభ్యం కావడం, పెద్దపరిశ్రమలు ఇస్తున్న పోటీ, ఇవన్ని మనం పరిశీలించి, సమస్యలు సరిగ్గా పరిష్కారం చేయవలే.

ఇప్పటివరకు భారతప్రభుత్వం చిన్న పరిశ్రమలబోర్డ్, ఖాధీ గ్రామీణ పరిశ్రమలబోర్డ్, భారత చేతిపరిశ్రమలబోర్డ్, చేనేతబోర్డ్, కాయర్ బోర్డ్, సిల్క బోర్డ్ మొదలైన సంస్థలను నెలకొల్పి వాటి ద్వారా చిన్న పరిశ్రమలు ఎదుర్కొంటున్న సమస్యలు పరిష్కారం చేస్తున్నారు. అంతేకాక 1962-62 లో భారత ప్రభుత్వం, గ్రామీణ పారిశ్రామిక పథకం అమలు జరిపి, 45 ప్రదేశాలలో మొదట దీనివి ప్రవేశ పెట్టడం జరిగింది 5వ ప్రణాళికా కాలంలో మరి 57జిల్లాల లకు, ఈ పథకాన్ని విస్తృతం చేసినారు. గ్రామ సీమలలోని స్థానిక వనరులు ఉపయోగించి, చిన్న వికేంద్రీకరణ పరిశ్రమల ద్వారా, గ్రామ సీమల ప్రజలు, పొట్ట పట్టుకొని పట్టణాలకు రాకుండా గ్రామ సీమలలోనే ఉపాధిసౌకర్యాలు కలగచేయటమే ఈ పథకం ముఖ్యోద్దేశం. గ్రామసీమలను మన దృష్టిలో పెట్టుకొని వారికి సరిపడే పరిశ్రమలు మనం స్థాపించవలె. ఇది భారతదేశానికి కొత్త విషయం కాదు. మహాత్మాగాంది ఎన్నోసార్లు ఈ విషయం మనకు చెప్పే ఉన్నాడు. ఆయన కాలంలో, చర్ఖాసంఘం, గ్రామీణ పరిశ్రమల సంఘం స్థాపించడం జరిగింది. గ్రామీణ పరిశ్రమల సంఘా నికి ఆయన చాల సంవత్సరాలు అధ్యక్షుడు కూడా. ఈ సంఘంలో కొన్ని సంవత్సరాలు పనిచేసే భాగ్యం, ఈ రచయితకు కలిగింది.[1]

పారిశ్రామికీకరణ నవీనతకు చిహ్నమైతే గ్రామీణ పారిశ్రా మికీకరణ ద్వారానే, స్థానికంగా లభ్యమయ్యే వనరులు ఉపయో

---

1. ఈ రచయిత యొక్క 'Sevagram and other Gandhian Institutions of Wardha' లోను, 'Small Scale and Cottage Industries and Planned Economy' లోను పూర్తి వివరాలు లభిస్తాయి.

గించి, గ్రామసీమల సౌభాగ్యానికి తోడ్పడి, దేశాన్ని కొత్త బాటకు తేవచ్చు. ఈ చిన్న పుస్తకంలో, గ్రామీణ పారిశ్రామికీకరణ ఎదుర్కొంటున్న సమస్యలు, ఇప్పటి వరకు జరిగినవని, ఇక ఏవిధంగా ఈ కార్యక్రమాన్ని చేపట్టవలె అనే విషయాల గురించి తెలుసుకొందాము.

గ్రామీణ అభివృద్ధి వ్యూహంలో గ్రామీణ పరిశ్రమల అభివృద్ధికి కూడలి స్థానం ఉంది. ఈ మధ్యనే భారత ప్రధాని ఒక సమావేశంలో మాట్లాడుతూ ఉపాధి సౌకర్యాలు, ఉత్పత్తి పెంచే గ్రామీణ కార్యక్రమాలకు ఇప్పటినుంచి, ఎక్కువ విలువ ఇస్తారని, ప్రణాళికల రచనలోకూడ మార్పు వస్తోందని ఆయన అన్నారు. ఇప్పటి వరకు పెద్ద పెట్టుబడి పెట్టి పరిశ్రమలు అభివృద్ధి చేసినామని, కాని గత 30 సంవత్సరాలలోను, వాటివల్ల అనుకొన్న లాభాలు రాలేదు సరిగదా నష్టాలుకూడ వచ్చినా యన్నారు. దేశం ఏమీ అభివృద్ధి చెందలేదని చెప్పలేము. స్వాతంత్రం వచ్చిన తరవాత పారిశ్రామికంగా దేశం ముందంజ వేసిందని చెబుతూ, దీనివల్ల వచ్చిన సౌభాగ్యం కొంతమందికే వచ్చిందని, చాలామంది కనీసపు కోరికలైనా తీర్చలేక పోయినామని, దానితో ప్రజలలో సహజ అసంతృప్తి వచ్చిందన్నారు. పాశ్చాత్య దేశాలు అవలంబిస్తోన్న పద్ధతుల వ్యామోహంలో పడి, "పెద్ద పరిశ్రమలు పెద్ద పరిశ్రమలు" అంటూ న్నామని, పెద్ద పెట్టుబడి పరిశ్రమలు ఇచ్చే ఉపాధి సౌకర్యాలు చాలా తక్కువని, పెట్టుబడి నిష్పత్తి చాల హెచ్చని చెబుతూ కొన్ని భారీ పరిశ్రమలలో, ఒక్క మనిషికి పని అవకాశం ఇవ్వాలంటే, 25, 000 నుంచి లక్ష రూపాయలవరకు ఖర్చు పెట్టాలని ఆయన అన్నారు. కాని కుటీర గ్రామీణ పరిశ్రమలలో, 500 రూపాయలు కూడా ఖర్చు లేదన్నారు. ప్రణాళిక అనే భావన (Concept) భారత దేశంలో జవహర్‌లాల్ నెహ్రూ ప్రవేశపెట్టి దేశానికి గొప్ప సేవ చేసినారని, ప్లానింగ్ తప్పుదోవన పోవటంలో దేశానికి తీరని నష్టం వచ్చిందన్నారు. ఆయనే కొంత కాలం బ్రతికి ఉంటే తప్పులు సరిదిద్దేవాడు అన్నారు. గ్రామసీమలలోని ప్రజలు పట్టణాలకు తరలి రాకుండా చేయలని, పట్టణాలలో మురికివాడలకు నేరాలు అరికట్ట

డంలో ఖర్చు పెట్టె ధనం, గ్రామ సీమలలో ఖర్చుపెడితే గ్రామీణ ప్రజలు గ్రామాలు విడనాడరన్నారు భారత ప్రధాని.

ఏది ఎట్లున్నా భారతదేశంలో వ్యవసాయాన్ని మనం మరువ కూడదు. చాలమందికి ఉపాధి సౌకర్యం ఇవ్వటమే కాక, కొన్ని పరిశ్రమలకు వ్యవసాయమే ముడిసరకులు లభ్యమయ్యేటట్లు చేస్తోంది. వ్యవసాయంలో ఉత్పాదకత (Productivity) పెంచవలె. దాని అర్థం పెద్దఎత్తున భారీ వ్యవసాయం చేయాలని కాదు. సన్న కారురైతు ఉత్పాదకత హెచ్చు చేయవచ్చు. సూరత్‌ఘర్ (Suratgarh) లో, 30,000 ఎకరాల భారి వ్యావసాయక క్షేత్రాన్ని నెలకొల్పడం జరిగింది. ట్రాక్టర్లు, అన్ని ఉపయోగించటంతో పని అవకాశాలు ఇక్కడ తగ్గినాయి. యంత్రాలు ఉపయోగించే పెద్ద వ్యవసాయ క్షేత్రాలే మన ఉత్పాదకత (Productivity) హెచ్చు చేస్తాయనటం చాల తప్పు. సరిగ్గా వనరులు ఉపయోగిస్తే చిన్న వ్యావసాయిక క్షేత్రాలలో కూడ ఉత్పాదక శక్తి పెంచవచ్చు.

పెద్ద పెట్టుబడి పరిశ్రమల వల్ల ధనికులు, పేదవారి మధ్య గొప్ప వ్యత్యాసంవచ్చింది. సమాజంకూడ పెట్టుబడిదారుల అధి కారం కిందకువచ్చింది. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి అంతా కొద్ది మందిచేతిలో ఉంటుంది. ఒక పారిశ్రామిక పెట్టుబడి దారుని ఆస్థి గత 30 సంవత్సరాలలో 30 కోట్లనుంచి 1200 కోట్ల రూపాయ లకు పెరిగిందట. గొప్ప పేదరిక మహాసముద్రంలో కొద్ది పెట్టుబడి దారుల దీవులుండటం సంఘానికి క్షేమంకాదు.

భారత దేశంలో ప్రజాస్వామ్యం, ప్రజాక్షేమ రాజ్యం, సామ్య వాద రీతి సమాజ వ్యవస్థ స్థాపించనున్నాము. ఈ సూత్రాలను భారత రాజ్యాంగమే నిర్ణయించింది. ఇది జరగాలంటే, సంఘంలో అందరు బాగుండవలె.

మన ఆర్థిక శాస్త్రవేత్తల దృష్టిలోకూడ మార్పు చాల అవ సరము. ఆర్థిక సమస్యల పరిష్కారం గురించి వ్రాస్తూన్నప్పుడు, పెద్ద పెద్ద పరిశ్రమలకే ప్రాధాన్యం ఇవ్వటం, ఇది ఆర్థికాభివృద్ధికి ముఖ్య వ్యూహం, కీలకమైన ధ్యేయం అని చెప్పటం మామూలైంది. దానిచే Strategy of Heovy industries" అంటారు. పేదరికాన్ని దూరంచేయ వలసినస్థితిలో, జనాభా ముమ్మరంగా పెరుగుతూ, నిరుద్యోగం తీవ్ర

రూపం దాల్చిన స్థితిలో పెద్ద పరిశ్రమలలో త్వరితంగా ఈ సమస్య పరిష్కారం చేయలేని పరిస్థితిలో, ఇట్లాంటి సలహాలవల్ల లాభంలేదు. అందుచేత ఆర్థిక శాస్త్రవేత్తలు, రోమ్ పట్టణంలోఉండే, నీరో (Nero) వలె ఫిడేల్ వాయించటంలో కాలం గడప కూడదని గుర్తించవలె.

ప్రజలు ఆర్థికంగా స్వతంత్రులై ఉండాలంటే, పారిశ్రామికీకరణ పట్టణాలలోనే ఉండకూడదు. గ్రామీణ పారిశ్రామికీకరణ ద్వారానే గ్రామసీమలలోని చిన్న పరిశ్రమలు అభివృద్ధి చేసి, గ్రామాల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడవచ్చు. భారతదేశం బ్రిటిష్ పాలనలో ఉన్నప్పుడు, పారిశ్రామికీకరణ చేయలేదు సరికదా, మన కుటీర పరిశ్రమలను చేతిపనులను ధ్వంసం చేయడంజరిగింది. అందు వల్లనే దాదాభాయి నేరోజు "Povrerty and British Rule" అనే గ్రంథాన్ని వ్రాసినారు.

అనాదినుంచి భారత దేశంలో గ్రామాలు స్థిరమైన సంఘ స్థాపనకు ఎంతో తోడ్పడినాయి. గ్రామాలు చాలవరకు స్వయం సంపూర్ణంగా ఉండేవి. గ్రామసీమలకు పట్టణాలకు సన్నిహిత సంబందం ఉండేది. గ్రామాలలో తయారయ్యే సరకులకు స్థానికంగాను విదేశాలలోనుకూడా గిరాకీ ఉండేది. 17 వ శతాబ్దంలో భారతదేశం సందర్శించిన (Tavermier) ఖరారు చేసినాడు. R. C. Dult గారు, భారత పారిశ్రామిక పెరుగుదల గురించి, ఒక ముఖ్యమైన విషయం వెల్లడి చేసినారు. అది 19 వ శతాబ్దం మొదటి భాగంవరకు భారత దేశంలోని చాలశాతం ప్రజలు పరిశ్రమలలో నిమగ్నులై వున్నారని భారత దేశం ఎంతవరకు వ్యావసాయిక దేశమో, అంతవరకు పారిశ్రామిక దేశం కూడానని ఆయన వ్రాసిన దానిలో చాలసత్యముంది.

పరిశ్రామల విస్తరణ క్రమ బద్ధంగా ఉండటమే కాక, అనేక రకాలుగా ఉండేవి. గ్రామాలు, ఆర్థిక వ్యవస్థకు మూలవిరాట్టుగా ఉండేవి. పట్టణాలు, అతి సున్నితమైన సరకులు చేస్తుండేవి. గ్రామాలు పట్టణాల మధ్యనుంచి సమన్వయం ఉండేది. సంఘంలో కళాకారులను ఎంతో గౌరవించేవారు. భారత దేశంలో వస్త్ర పరిశ్రమ అనాదినుంచి వస్తోంది. మార్కోపోలో (Marco polo) ఆంధ్ర ప్రదేశం దర్శించి అవి ఎంతో అందంగా ఉన్నాయని, అవి ధరిస్తే ఎంతో

సంతోషం కలుగుతుందని వ్రాసినాడు. ఆ రోజులలో వీటిని విదేశాలకు ఎగుమతిచేసి, అక్కడివారి మెప్పుపొంది విదేశమారకం కూడా సంపాదించే వాళ్ళము. మన విదేశవ్యాపారాన్ని, వస్త్ర పరిశ్రమను, గ్రామీణ పరిశ్రమను స్వలాభంకోసం, ధ్వంసంచేసినారు. ఇగ్లాండ్ లోని పారిశ్రామిక విప్లవం, భారత దేశపు ప్రజల డబ్బుతో జయప్రదం అయింది. పారిశ్రామిక ప్రగతి నుంచి, మన కళాకారులు పూర్తిగా నసించి పోయినారు. సర్ వెలెన్టైన్ ఛారిల్ (Sır Valentone chırol) కూడ బ్రిటీషువారు అవలంబించిన పద్ధతి సరిఅయినది కాదని ఒప్పుకొన్నాడు. మహాత్మాగాంధి రాజకీయ రంగంలోకి ప్రవేశించిన తరవాత తిరిగి స్వదేశీ ఉద్యమం వచ్చింది. జాతి పునర్నిర్మాణానికి ఖద్దరు ఉద్యమాన్ని లేవదీసినాడు. అంతేకాక గ్రామీణ పరిశ్రమలు కూడ తిరిగి పైకి రావాలని, ఆయన ప్రత్యేకంగా ఒక సంఘాన్ని స్థాపించినాడు. చరిత్రాత్మకంగా, భారతజాతి పూర్వ ఆర్థికవ్యవస్థను తలుచుకొంటే గర్వపడవచ్చు. మారుతున్న పరిస్థితులను బట్టి తగు సర్దుబాటులు చేసుకోవవచ్చు. కాని వ్యవస్థను మరువరాదు. భారత జాతి నిర్మాణం గ్రామ సీమలనుంచే వచ్చిందనే విషయాన్ని మనం మరువరాదు. ఇట్లాంటి క్లిష్ట పరిస్థితులలో కూడ మన కళాకారులు చేతిపనివారు, వారివారి కులవృత్తులను విడనాడలేదు. దానిని బట్టి భారతీయులు ఆర్థిక ప్రతిఫలం మాత్రం ఒక్కటే పరిగణించరని, వారికికూడ జీవిత లక్ష్యముందని మనం గుర్తించవలె. ఒకప్పుడు రాజులు. భూస్వాములు వారిని పోషించేవారు. కాని వారు ఇప్పుడులేరు. లేనప్పటికి భారతజాతి లేదా? ఆజాతి, వారి సరకులను పోషించలేదా?

ఈ విషయంలో మనం ముందుగా తీసుకోవలసిన చర్యలు, కొన్ని ఉన్నాయి. స్థానికంగా లభ్యమయ్యే ముడిపదార్థాలు, అక్కడే వస్తువులు తయారు చేయటంలో ఉపయోగించవలె. అవసరాలకు పరిసర ప్రాంతాలలో మార్కెట్లు లభించేటట్లు చేయవలె. కుటీర పరిశ్రమల సరకులు అంత నాణ్యంగా ఉండవని చాలమంది చెప్పటంకద్దు. అప్పుడు తగిన సాంకేతిక పద్ధతులు ప్రవేశపెట్టి, సరుకుల నాణ్యత హెచ్చుచేయవచ్చు. ఏదిఏట్లున్న, గ్రామీణ చేతి పని వారాలకు చేతి నిండ పని ఉండేటట్లు చేయవలె.

ఇక్కడ మనం, ఒక ముఖ్యవిషయం గమనించవలె. మన దేశంలో, 25 సంవత్సరాలకు పైగా ప్రణాళికా యుగం మొదలు పెట్టినా, తలసరిరాబడి ఈ ఈనాడుకూడా ఒక రూపాయకు మించకుండంట శోచనీయం. 1974-75 లో ఒక రూపాయకు తగ్గి ఉంటే 1975-76 లో ఒక రూపాయి 5 పైసలకు హెచ్చింది.

మన జాతీయ రాబడి, సరాసరి రాబడి, ఎంత తక్కువగా ఉందో కింది పట్టిక రూపంలోని నివేదిక నుంచి తెలుస్తుంది.

| | జాతీయ రాబడి (కోట్లలో) | వ్యక్తిగత రాబడి (రూపాయలలో) |
|---|---|---|
| 1969-70 | 19033 | 324 |
| 1971-72 | 19367 | 350.2 |
| 1973-74 | 20334 | 341.2 |
| 1975-76 | 22347 | 371.1 |

ఈ మధ్యనే పార్లమెంట్‌లో సభ్యులకిచ్చిన జవాబులలో ఆంధ్రప్రదేశం కూడా పేద రాష్ట్రాలలో ఒకటని, మన సరాసరి వ్యక్తిగత ఆదాయం, జాతీయదానికంటె తక్కువగా ఉందని తేలింది. ఇన్ని వనరులున్నా ఈ రాష్ట్రం వనరులలో ధనిక రాష్ట్రమైన, జాతీయ ఆదాయంలో తక్కువగా ఉండి, పేదరికాన్ని చూపిస్తోందంటే మనం విచారించి, అందరం కలసి పనిచేసి అందరికీ తిండి, కట్టుకోటానికి బట్ట వచ్చేటట్లు చేయవలె. ఇది చేయటం కష్టాసాధ్యంకాదు.

దీనిని బట్టి మన సహజ వనరులు, సాధ్యమైనంత వరకు స్థానికంగా ఉపయోగించుకోవలె. దిగుమతులు, మన కనీసపు కోరికలు తీరిననాడే చేయవలె. అందువల్లనే ఈ మధ్య భారత ప్రభుత్వం కూరగాయలు, తదితర వస్తువులు ఎగుమతి చేయకూడదని నిర్ణయించింది.

భారత దేశపు ప్రజలలో చాల మంది గ్రామసీమలలో ఉన్నారుగనక, వారి ఆర్థిక ప్రగతికి గ్రామీణ పారిశ్రామికీకరణ, చాల అవసరమని మనం గుర్తించవలె.

# 3

# గ్రామీణోద్యోగిత ఉద్యమం

ఇప్పటి వరకు భారత దేశం, గ్రామీణ దేశమని, చాల వరకు ప్రజలు గ్రామసీమలలోనే ఉన్నారని తెలుసుకొన్నాము. గాంధీజీ, గ్రామసీమల ఆర్థికవ్యవస్థ బాగుచేయాలని పదే పదే చెప్పేవాడు. పట్టణాలపై ఆధారపడిన ఆర్థికవ్యవస్థలో కర్షకులు, తదితరులు, దోపిడీకి గురి అవుతారని ఆయన వాదన. హెచ్చుజనాభాగల దేశంలో ప్రవేశ పెట్టవలసిన ప్రయోగాత్మక ఆర్థిక విధానానికి, జనాభాలేని దేశాలలో ఉండవలసిన ఆర్థికవ్యవస్థకు చాల తేడా ఉన్నదని ఆయన పదే పదే చెప్పేవారు. భారత దేశపు ఆర్థిక కార్య క్రమాలలో గ్రామసీమలకు కూడలిస్థానం ఇవ్వాలనేవారు. చాలమంది ఆధునిక ఆర్థిక శాస్త్రవేత్తలు ఆయనను అర్థం చేసికోలేక గాంధిజీ ప్రజలను గ్రామాలకు తరలి పొండి అన్నాడని, ఆయన ఉద్యమం ప్రజలను ముందుకు తీసికో పోదని, ఇది అభివృద్ధికి సూచనకాదని ఖండించేవారు. ఒకసారి ఒకాయన, పట్టణాలలోని ప్రజలు అక్కడ మంచి తరలి పోవాలని ఆయన అభిప్రాయమా అని గాంధీజీ ప్రశ్నించగా, పట్టణాలు గ్రామీణ ప్రాంతాలను దోపడి చేయకుండా ఉండాలని మాత్రమే ఆయన ఆతృత అన్నారు. అంతేకాక ఆయన పట్టణాలకు ఎంతమాత్రం వ్యతిరేకం కాదన్నారు.

గ్రామీణ కార్మికులలో నిరుద్యోగిత, అల్పోద్యోగిత ఉంది. వారికి ఈమధ్యనే కనీసపు వేతనాల శాసనం అను వర్తింప చేసినారు. కాని దీనివి అమలులో పెట్టటం చాల కష్టమైనపని. దానికి కారణం, వీరు అనేకచోట్ల ఉన్నారు. వీరికి ట్రేడ్ యూనియన్‌లు కూడాలేవు. కావలసిన పని చేయటానికి మనుష్యుల సంఖ్య తక్కువగా ఉంటే యాంత్రికీకరణ (Mechanisation) మంచిదికాని కావలసిన జనం కంటె భారత దేశంలోవలెహెచ్చుగా ఉంటే, అట్టిపరిస్థితులలో ఇది చెడ్డది అన్నారు. సంవత్సరంలో సుమారు సగం భాగం వ్యక్తి పనిలేనిస్థితిలో, అతనికి పనిఎట్లా కలగచేస్తాం అనేవిషయం మనం

గుర్తించవలె. దేశం ఎదుర్కొంటున్న ఆర్థిక సమస్యలు, సరిగ్గా ప్రజల దృష్టికి తీసుకు రావలె. 4 ప్రణాళికలలోను," పరిశ్రమలు అభివృద్ధి చెయ్యలేకపోతే నశిస్తుంది" అని, పెద్ద పెట్టుబడి పరిశ్రమలు స్థాపించడం జరిగింది. ఉద్యోగావకాశాల సమస్య పరిష్కారం చేయలేక పోయినాము సరికదా, నిరుద్యోగసమస్య తీవ్రరూపం దాల్చింది.

ప్రణాళికల ముఖ్యోద్దేశం, ప్రజలకు ఉద్యోగావకాశాలు ఇచ్చి పేదరికంపారదోలడం రెండవది. ఉత్పత్తి అయిన సరకులు, న్యాయ రీతిని పంపిణీ (distribution) కావలె. గాంధీజీ ప్రకారం ఖాదీ గ్రామీణ పరిశ్రమలు, అర్థికస్వాతంత్ర్యానికి, సమానత్వానికి చిహ్నాలు. ఉత్పత్తి వికేంద్రీకరణ కావాలని ప్రజలకు కావలసిన కనీసపు అవసరాలు, అందరికీ అందేటట్లు చూడవలె. దీనివల్ల గ్రామీణ ప్రజలు ఉత్పత్తి పనులలో నిమగ్నులై వుంటారని ఆయన అన్నారు. ఆయన కాలంలో కూడ 15 మిలియన్‌ల పారిశ్రామిక కార్మికులలో 2 మిలియన్‌లు మాత్రమే పెద్ద పెట్టుబడి యంత్రాగారాలలో పని చేసేవారు. ఈ స్థితి ఇప్పటికీ మారలేదు. వికేంద్రీకరణ లక్షణాలు ఉన్న కుటీర పరిశ్రమలు, ప్రజలకు ఉపాధి సౌకర్యాలు వారి ఇంట్లోనో గ్రామం లోనో ఇస్తాయి. ఇప్పటికి కూడా దూర దూరాలలోవున్న గ్రామ సీమలలో కళాకారులలో ఎంతో పనితనం చూస్తూనే ఉంటాము.

మనరాజ్యాంగం ప్రకారం ప్రతి వారికిపనిచేసి జీవించేహక్కు ఉంది. ప్రణాళికల ముఖ్యపరమావధి అందరికి పూర్తిపని అవకాశాలు ఇవ్వటమే. పని చేయదలచిన ప్రతివ్యక్తికి పని అవకాశాలు కలుగ చేయాలని, విద్యుచ్ఛక్తికాని, అణుశక్తి (Atomic power) గాని ఉపయోగించినా ఫరవాలేదని, దానివలన ఎవరికి ఉపాధి సౌకర్యాలు పోకూడదనిచెప్తూ, పెరుగుతున్న జనాభాగల, తక్కువ పెట్టుబడికల ఈదేశంలో ఇది జరగ గలదని ఆయనను ఒప్పించాలని గాంధీజీ అన్నాడు.[1] ఖాదీ గ్రామీణ పరిశ్రమలు కాకుండా ఇతర కార్య క్రమంద్వారా ప్రభుత్వం ప్రజలకు పూర్తి ఉపాధి సౌకర్యాలు కలుగచేస్తే, ఆయన నిర్మాణ కార్యక్రమానికి స్వస్తి చెప్తానన్నాడు.

1. పూర్తి వివరాలు, రచయిత మైసూరు విశ్వ విద్యాలయంలో, Gandhian Contribution to Indian Economic Life అనే అంశం పై ఇచ్చిన రెండు ఉపన్యాసా లలో తెలుసు కొనవచ్చు.

ఆచార్య వినోభాభావేకూడా ప్లానింగ్ కమిషన్ ఎదుట మాట్లాడుతూ ఖాదీగ్రామీణ పరిశ్రమలు కాకుండా ఇతర మార్గాలవల్ల ఈ సమస్య పరిష్కారంచేస్తే, తనకట్టెతో తయారు చేసిన చర్ఖాపగలకొట్టి, ఒక రోజు వంటకు ఆ కట్టెలను వంటచెరుకుగా వాడుతానన్నాడు.

నిరుద్యోగసమస్య నానాటికి తీవ్రరూపం దాలుస్తోంది. 5 వ ప్రణాళికా కాలం పూర్తి అయ్యేసరికి 40 మిలియన్‌ల, బకాయి లెక్క (Back log) ఉంటుందని అంచనా వేయడంజరిగింది. పనిచేస్తా మనే వారికి పనిఅవకాశాలు కలిగించే బాధ్యత ప్రభుత్వానికిఉంది. లేకపోతే నిరుద్యోగ పరిహారాలు ఇవ్వవలె. ఈ విషయంలో 11 డిశంబర్ 1963 జవహర్‌లాల్ నెహ్రూ లోక్‌సభలో మాట్లాడుతూ, ప్లానింగ్‌వల్ల చాలమందికి కొద్దికాకపోతే కొంచెమైనా మేలు జరిగినా ఎంతో మందికి ఏమేలు జరగలేదుకదా, వారి పేదరిక బాధభరింప రానిదిగా ఉందని, ఈ పరిస్థితి బాగుచేయటానికి ఒక మంచిమార్గాన్ని ఆలోచించాలన్నారు. గాంధేయ మార్గాలగురించి కూడ ఆయన ఆలోచిస్తున్నానికూడ చెప్పినారు. ఈ మధ్యనే భారత ప్రధాని మురార్జిదేశాయి విరుధానగర్‌లో మాట్లాడుతూ, పనిచేయదలచు కొన్న ప్రతివ్యక్తికి సరిఅయినపని అవకాశాలు ఇవ్వాలని భారత ప్రభుత్వం తీవ్రంగా ఆలోచిస్తుందని, నూటికి 30 మందికి మాత్రమే అవకాశాలుండటం, 70 మంది పేదరిక బాధలో ఉండటం భరించ రానిదన్నారు. ప్లానింగ్ కమిషన్‌నుకూడ దేశంలోని వయోజనులకు ఉత్పత్తి పూరితమైన పూర్తి ఉద్యోగావకాశాలు, తొందరగా ఇచ్చేటట్లు చూడమని, భారత ప్రధాని ఆదేశించినారు. వ్యవసాయాభివృద్ధి గ్రామీణ పరిశ్రమలు, చిన్న పరిశ్రమలద్వారా ఈ సమస్యను ఎదుర్కొనవలెనని చెప్పినారు. కొంతకాలం కొన్ని పెద్దపరిశ్రమల ప్రాధాన్యత కొంత తగ్గిస్తామనికూడ అన్నారు. ప్లానింగ్ కమిషన్ ఈ విషయంలో ఆలోచన మొదలుపెట్టింది. స్వయం ఉపాధి (Self-employment) సౌకర్యాలు పథకాలు గురించికూడ ప్లానింగ్ కమిషన్ ఆలోచిస్తున్నట్లు తెలుస్తోంది.

1973-74 నుంచి స్వయం ఉపాధి పథకాలు భారతప్రభుత్వం అమలు జరిపింది. ఆంధ్రప్రదేశ్. ఈ విషయంలో బాగా పనిచేసింది. విద్యావృద్ధికి తగినట్లుగా, ఉద్యోగావకాశాలు కల్పించే ప్రణాళికలు

రూపొందించక పోతే నిరుద్యోగసమస్య ఇంకా తీవ్రరూపం దాలుస్తుంది.

అంతర్జాతీయ ఆర్థిక శాస్త్రవేత్త, విల్‌హిల్మ్‌రోపక్ (Wilhm Ropke) తన (Human Ecmonny) లో వెనక బడినదేశాలలో సామాన్య మనుషు భౌతిక వైభవమే (Material Property) ముఖ్య లక్ష్యాలుగా పెట్టుకోటం తప్పని భారతదేశం కూడ భౌతిక వైభవం గల సాంఘిక వాదాన్ని గాంధేయ మానవ శేయస్సు పద్ధతి అను సరించకుండా ఇతర పద్ధతులకు పోవటం శోచనీయం అన్నారు. ఆధునిక ఆర్థికాభి వృద్ధి పథకాలలో, గాంధేయ మార్గానికి చాల విలువ ఉందని పాశ్చాత్య ఆర్థిక శాస్త్రవేత్తలే ఒప్పుకొంటున్నారు. మనకు పెట్టుబడి తక్కువ. ఎంతసేపు "అప్పుచేసి పప్పుకూడు తిందాం అనుకోకూడదు." ఏంతమందికో పని అవకాశాలు కలుగ చేయవలసివుంది. ఈ చిన్న విషయాలు ఏందుకు మరుస్తామో తెలి యకుంది. జి.డి.హెచ్.కోల్(G D H Cole) అనే బ్రిటిష్ ఆర్థిక శాస్త్ర వేత్తకూడ, భారతదేశం పెద్దపెట్టుబడి పద్ధతులలో పారిశ్రామికంగా పైకి రావాలనుకోటం తప్పని, పెరుగుతోన్న జనాభా కనీసపు కోరికలుతీర్చే సమస్య ముఖ్యమైనదని, ప్రజలను "ఆగండి ఆగండి" అంటే లాభం లేదన్నాడు. గ్రామీణ పరిశ్రమలు, ప్రజలకు పని అవ కాశాలు ఇవ్వగల వన్నారు ఆయన.

ప్రచ్ఛన్న నిరుద్యోగం (Disguised unemployment) చాల తీవ్రమైన సమస్య. నేషనల్ శాంపుల్ సర్వే (National Sample Survey) సెకండ్ అగ్రికల్చురల్ ఎన్‌క్వయిరీ (Second Agricultural Enquiry) ప్రకారం, వ్యవసాయంలో వక్తి 166 రోజులకు పైగా పనిలేదు. ఎంప్లాయిమెంట్ రిజిస్టర్‌ల (Employment Register) లో 6.89 మిలి యన్‌లు. 1972 లో ఉన్నారు. చాలమంది వారిపేర్లు నమోదు చేసుకోరు. విద్యలేనివారు, సాంకేతిక జ్ఞానంలేనివారు ఎంత మందో నిరుద్యోగులై ఉన్నారు. భగవతీ కమిటీ (Bhagvati Committee) నివే దిక ప్రకారం, పనిలేని 13.7 మిలియన్‌లో 9 మిలియన్‌లకు అసలు పనిలేదు. తక్కువ పనిగల మిగతా 9.7 మిలియన్‌లకు కూడ వారానికి 14 గంటలు మాత్రమే పనిఉంది. వివిధ ప్రణాళికలు ఈ సమస్య పరిష్కారం చేయుకుండటం శోచనీయము. ఇప్పటి పెరుగుదల

నమూనా ప్రకారం 30 సంవత్సరాలు అయితేనేగాని పేదప్రజల కనీసపు కోరికలు తీరవు. నిరుద్యోగ సమస్య, తక్కువపని అవకాశాల సమస్య తీవ్ర సమస్యలు. వ్యవసాయం మాత్రమే ఈ సమస్య పరిష్కారం చేయటం కష్టం. గ్రామీణ ఆర్థికవ్యవస్థ పునరుద్ధరించాలంటే, ప్రాథమిక, ఉప, పారిశ్రామిక ప్రకియలు హెచ్చుచేయవలె. దానితో చాలమంది వ్యవసాయేతర పనులలో నిమగ్నులై ఉండటానికి వీలుంటుంది. మన ప్రజలలో గొప్పశక్తిఉంది. దూరదృష్టితో ఉన్న ప్రణాళిక తయారుచేసి, ఈశక్తిని తగురీతిగా ఉపయోగించవలె. పనిలేకుండా మిలియన్‌లను కూర్చోపెట్టకూడదు; పెట్టలేంకూడా.

నిరుద్యోగ సమస్య తీవ్రరూపం దాల్చింది గనక తక్కువ పెట్టుబడితో అమలు జరపకలిగే పథకాలు చేపట్టవలె. ప్రణాళిక రూపం, యంత్రం ఉపయోగాల పెట్టుబడి, కార్మికుల ఖరీదును బట్టి ఉంటుందని మరవరాదు.

నిజంగా చూస్తే చేతితో నూలు దారం తీయడం చాల మంచి కుటీర పరిశ్రమ. పత్తి అన్ని ప్రాంతాలలో లభ్యమవుతుంది. వ్యవసాయ దారులకు ఉపవృత్తిగా ఉంటుంది. ఇక్కడ కూడ సాంకేతిక విజ్ఞానంతో అంబర్ ఛర్ఖా (Amber Charkhas) కూడ ప్రవేశపెట్టడంజరిగింది. ఒకవ్యక్తి 8 గంటలు నూలు వడికితే సుమారు 2, $2\frac{1}{2}$ రూపాయలు ఒక రోజులో సంపాదించవచ్చు. భారత దేశంలో సరాసరి రాబడి 1 రూపాయకు మించటంలేదు గనక, ఇది మంచి రాబడే అని చెప్పవచ్చు. గాంధీజీ కాలంలో, అఖిల భారత చర్ఖా సంఘం 80 లక్షల రూపాయల పెట్టుబడితో, 4 లక్షల పని వాళ్ళకు ఉపాధి సౌకర్యం ఇచ్చేది. అదే మిల్లులో పెడితే 20,000 మందికి కూడ ఉపాధి సౌకర్యం దొరికేదికాదు. అట్లాగే నూనె గానుగల పరిశ్రమ, దంపుడుబియ్యం పరిశ్రమ, ఇంకా ఎన్నో గ్రామీణ పరిశ్రమలు ఉపాధి సౌకర్యాలు కేంద్రీకరణ పద్ధతిలో ఇవ్వటానికి ఎంతో తోడ్పడతాయి. గాంధీజీ ఖద్దరు పరిశ్రమ అభివృద్ధి చేయుటంలో పరమార్థం, గ్రామసీమల నుంచి పేదరికాన్ని తరిమివేయుటమే అని, గ్రామసీమల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడటంమే అని జి.డి. హెచ్

కోల్ (G.D.H. Coll) వ్రాసిన దానిలో చాల సత్యముంది. ఒకప్పుడు గాంధిజీ ఖద్దరు దారాన్ని కరెన్సీ (Curency) గా ఉపయోగించాల న్నాడు.

చాలకాలం నుంచి, భారత గ్రామ పునర్నిర్మాణం పునర్వ్యవస్థీకరణం చేయాలని అనుకున్నారు కాని గాంధీ భారత రాజకీయ రంగంలోకి వచ్చిన తరవాతనే ప్రజల యోగక్షేమం మీదనే, దేశం యోగక్షేమం ఆధార పడివున్నదని గుర్తించడంజరిగింది. గాంధీజీ స్థాపించిన అఖిల భారత గ్రామోద్యోగ సంఘం, గ్రామీణ పరిశ్రమల అభివృద్ధికి ఎంతో తోడ్పడింది. దీనికి సంఘకార్యదర్శి జె. సి. కుమారప్ప (J.C. Kumarappa) గారు దేశానికి అపార సేవ చేసినారు. స్వాతంత్ర్యం వచ్చినాక, భారత ప్రభుత్వం నెలకొల్పిన ఖాదీ గ్రామోద్యోగ కమిషన్ ఈ పని చూడటం మొదలు పెట్టింది. కమిషన్ సబ్బుల పరిశ్రమ, చర్మపరిశ్రమ, అగ్గి పెట్టల పరిశ్రమ, ఖాండ సారి, చేతి కాగితం పరిశ్రమ, కుండల పరిశ్రమ, వడ్రంగం, కమ్మరి పరిశ్రమలకు 1972–73లో 38 కోట్ల రూపాయలు 18 లక్షల మందికి వేతనాలద్వారా ఇవ్వడం జరిగింది. 140 లక్షల రూపాయల విలువ గల వస్తువులు ఈ రంగంలో తయారయినాయి. 130 మిలియన్లు గ్రామసీమలలో ఉన్నారు. ఖాది కమిషన్ చేసిన పని ప్రశంశనీయం కాదని కొందరు చెప్పవచ్చు గాని ఇంతమందయినా గ్రామ సీమలలో ఉండటానికి కమిషన్ తోడ్పడిందని మనం గుర్తించవలె. కాకపోతే వారు కూడా పొట్ట పట్టుకొని పట్టణాలకు వచ్చేవారు.

మనం ఉత్పత్తిని వికేంద్రీకరణం చేయవలె. ఉత్పత్తి లాభానికా ఉపయోగానికా అనే విషయాన్ని మనం గుర్తించవలె. నిరుద్యోగులకు పని అవకాశాలన్నా ఇవ్వవలె, లేదా నిరుద్యోగ భృతి ఇవ్వవలె. ఖాదీకమిషన్ (Khadi Commission) 50 లక్షల రివాల్వింగ్ పెట్టుబడితో 190 లక్షల పనివారలకు పని అవకాశాలు ఇచ్చింది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశమైన అమెరికాలో కూడా నూటికి 80 శాతం గ్యారంటీడ్ వర్క్‌ప్లాన్ "పూచిపని అవకాశాలు" (Guranteed Work Plan) ఇవ్వవలెనని, నిరుద్యోగ భృతిలవల్ల లాభం లేదన్నారు. ఎవరైనా పని చేయకుండ భోజనం చేస్తే, వాడు దొంగ అనేవారు

గాంధీ. మన ప్రజలు కూడా కష్టపడి పనిచేయటానికి సిద్ధంగా ఉన్నారు. మనకు సహజవనరులా ఉన్నాయి. వాటిని ఉపయోగించి ప్రజలకు పని అవకాశాలు కలుగచేస్తే ఎంతో బాగుంటుంది.

ప్రభుత్వం కూడ, ఈ విషయంలో మార్గదర్శి కావలె. కుటీర పరిశ్రమల సరుకులు ప్రభుత్వం కొనవలె. ఖద్దరు కొంచెం ఖరీదైనా, దాన్ని ప్రజలు తోటి ప్రజలలో నిరుద్యోగం పోగట్టటానికి యిస్తున్న ఐచ్ఛిక (Volunatary) పన్నుగా భావించవలె.

ఇది మానిసిక సమస్య అయివుంది 1939 లో నాగపూర్ లో అఖిల భారత ఆర్థిక మహాసభ జరిగింది. వారు గాంధిజీ వద్దకు వచ్చి ఆర్థిక సమస్యలు గురించి చర్చించినారు. గ్రామసీమలలోని ప్రజలు కొన్ని వస్తువులు వారే తయారు చేసుకోగలిగితే, పరిశ్రమలు కేంద్రీకరించటం అర్థరహితమైన పని అన్నారు. గాంధీజీ ప్రకారం మన కోరికలుకూడ తగ్గించుకోవలె. ఇది నిజంగా చాల అవసరము. గ్రామ సీమల ఆర్థికవ్యవస్థకు ప్రభుత్వం సంరక్షణ ఇవ్వాలని పెద్ద పరిశ్రమలు వీటితో పోటీచేయనివ్వరాదని గాంధీజీ వాదన. ప్రతిదేశం కూడ పెద్ద ఎత్తున వస్తువులు ఉత్పత్తి చేస్తే, ఆసరకులకు మార్కెట్లు ఏవి? అన్నారు. ఈ పరిస్థితే, ప్రపంచ ఇక్కట్లుకు కారణమన్నారు. ఉత్పత్తికి, పంపకానికి ఏకీకృత సంబంధం ఉండాలని, ఉత్పత్తి, వాడకం స్థానికం చేస్తే ఉత్పత్తి హెచ్చుచేయాలనే అభిప్రాయమే పోతుందన్నారు. భారీఉత్పత్తి, ప్రజలకని, ప్రజలు భారీ ఉత్పత్తికికాదని మనంగుర్తించాలని గాంధీ వాదన. ఈ వాదనలో చాల సత్యముంది.

ఉత్పత్తి వికేంద్రీకరణం చేయాలని, విదేశంలో స్వదేశపద్ధతి అవలంబించాలని గాంధీజీ అభిప్రాయం. లాభాలకై పరిశ్రమలు కేంద్రీకరణ చేయటం తప్పని గాంధీ అనేవారు. ఆయన ప్రాణాళిక, మనిషి శక్తి, వికేంద్రీకరణ పద్ధతితో ఉత్పత్తిచేయటానికి పాటు పడుతుంది. ఇది భారత జాతి లక్ష్యాలపై ఆధారపడి ఉంది. నిజంగా చూస్తే, మన ప్రజలే మన శక్తి, మన సంపద కూడా. ఈ సంపద గ్రామాభివృద్ధికి ఉపయోగిస్తే ఎంతో బాగుంటుంది.

ఆర్థికాభివృద్ధి ముఖ్యలక్ష్యం, కొత్త ఉద్యోగ అవకాశాలు కలగచేయటం. ఈ అవకాశాలు కలగ చేయలేకపోతే ఆర్థికాభివృద్ధి

గాని, పారిశ్రామికాభివృద్ధి గాని ఎందుకో తెలియదు. కొత్త పరిశ్రమలు పెట్టి వారికి ఆర్థికసహాయం చేస్తుంది ప్రభుత్వం. వీటిని సబ్సిడీలు (Subsidies) అంటారు. పెట్టుబడి మీదకాక, కొత్త ఉద్యోగ అవకాశాలు ఇచ్చిన దానిమీద ఇది ఆధారపడిఉంటే చాల బాగుంటుంది. గ్రామసీమలలో, పరిశ్రమలు స్థాపించే వ్యవస్థాపకులకు తగిన తర్ఫీదు ఇవ్వవలె. వంశ పారంపర్యంగా వచ్చే నైపుణ్యం, సరిఅయిన అవకాశాలు లేక నశిస్తుంది. చేతికళలో నిపుణులైన కళాకారులు వారి సాంప్రదాయిక వృత్తులను విడనాడి ఇతర వృత్తులకు పోతున్నారు. దీనికి కారణం వారు కష్టపడి తయారు చేసిన సరుకులకు మార్కెట్టు సులభంగా దొరకటం లేదు. "మీరుకొంటారా మీరుకొంటారా" అని వారు బతిమాలవలసి వస్తోంది. బాంకులు కూడ గ్రామసీమల అభివృద్ధికి తోడ్పడవలె. అక్కడి పనివాళ్ళకు కావలసిన పరపతి సౌకర్యాలు, ఉచితరీతిని ఇవ్వవలె. ఆంధ్రప్రదేశ ప్రభుత్వం బాంకులు ఇచ్చిన ఋణాలు రెవిన్యూ అప్పులమాదిరిగా వసూలు చేయటానికి చట్టం చేసింది. మామూలుగా అప్పులు ఇచ్చేవారి వద్దకు చిన్న పారిశ్రామికులు పోతే హెచ్చువడ్డీ వసూలు చేస్తారు. బాంకులు సేవాధర్మంతో కుటీర పారిశ్రామికుల ఇక్కట్లు నివారించవలె.

# 4
# తగిన సాంకేతిక విజ్ఞానము

పాశ్చాత్య దేశాలలోని శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక విజ్ఞానం ఎంతవరకు ఉపయోగిస్తాయో ఆలోచించ కుండా మన దేశంలో ప్రవేశపెడితే, అవిమన సమస్యలను పరిష్కారం చేయవు సరికదా కొత్త సమస్యలు తెచ్చిపెడతాయి. అభివృద్ధి కార్యక్రమాల లాభాలు పేదరికం, ఆకలి బాధలో కింద ఉన్న 90 శాతం ప్రజల అభివృద్ధికి వినియోగించవలె. పాశ్చాత్య దేశాలలో జనసంఖ్య తక్కువ. పెట్టుబడి బాగా ఉంది. అందువల్ల వారి సాంకేతిక విధానం పెట్టుబడిమీద హెచ్చు ఆధారపడి, యంత్ర సామాగ్రి తయారు చేయటంలో ఉపయోగపడుతుంది. పనులు చేయటానికి కావలసిన మనుషులు లేరు కనక యంత్రాలే ఆ పనులు చేయవలె. అంతేకాదు. వారు లాభాలలో కూడ నిమగ్నులై ఉంటారు. దీనితో కొంతమంది ధనికులు చాల మంది పేదవారు ఉండటం జరుగుతుంది. ఈ సాంకేతిక విధానం, మనదేశంలోని గ్రామసీమల ప్రజలకు అంతగా ఉపయోగపడదు. మన పరమావధి గ్రామసీమల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడి, స్వావలంబన (Self-reliant) ఆర్థికవ్యవస్థ గా ఉండటమే రవీంద్రనాద్ టాగూర్, మహాత్మగాంధీ మొదలైన నాయకులు గ్రామీణ అభివృద్ధి విషయంలో చాలా శ్రద్ధ చూపినారు. గ్రామీణ ప్రాంత పరిశ్రమలు కూడ సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించుకొని, సంఘాభివృద్ధికి తోడ్పడాలని అభిప్రాయపడినారు. అంతేకాదు వారి వారి అభిప్రాయాల మీద వారి వారి సంస్థలలో పరిశోధనలు జరిపించినారు కూడా గాంధేయ ఉద్యమం పారిశ్రామికీకరణ, యంత్రాలపట్ల మనకు ఇదివరకు ఉండే దృష్టిలో చాల మార్పు తెచ్చింది.

ఇక్కడనే పరిశోధన సంస్థలు, పేదప్రజలను దృష్టిలో పెట్టుకొని, సాంకేతిక సమస్యలు పరిష్కారం చేయవలె. సిద్ధాంతరీత్యా, ఆర్థిక సమస్యలు పరిష్కారం చేయలేను. సిద్ధాంతాల ప్రకారం

పరిశోధనలు జరపరాదు. అది ఎంతవరకు ఆచరణయోగ్యమో మనం గుర్తించవలె. నిజంగా జీవితంలో ఎదుర్కొంటున్న సమస్యలలో పరిశోధనలు చాల అవసరము. గ్రామసీమలో విద్యుచ్ఛక్తి, రహదారి సౌకర్యాలు, ముడి పదార్థాల కొరత, యంత్రాల రిపేరికి సౌకర్యాలు లేక పోవటం–అనేక సమస్యలున్నాయి. 40 బ్రిటీషు విశ్వవిద్యాలయాలలో మధ్యస్థ సాంకేతిక విజ్ఞాం (Intermediate technology) మీద అనేక పరిశోధనలు జరుపుతున్నాయి. భారతదేశంలో కూడా పేదవారి అభివృద్ధిని మన దృష్టిలో పెట్టుకొని పరిశోధనలు చేయవలసిన అవసరం ఎంతో ఉంది.

గ్రామసీమలలోని పేదరికం, వెనకబడినతనం పరిష్కారం చేయాలంటే సాంకేతిక విజ్ఞానం కొంత కావలె. కాని ఇది సహజ సంపదలకు, అవసరాలకు అనువైనదిగా వుండవలె. భారతదేశంలో, ప నవ కల్పనలు (Innovations) ప్రవేశపెట్టినా మానవ కార్మికుల సంక్షేమానికి తోడ్పడవలె. కాని వారిని పనిలోనుంచి తప్పించటానికి తోడ్పడకూడదు. ఉత్పత్తి అభివృద్ధి చేయవలె. ఉత్పాదకత (Productvity) పెంపొందించవలె. జీవిత నాణ్యత కూడ పెంచవలె.

నాగలాండ్‌లోని వ్యవసాయదారులు, పంటలు మాసూలు చేస్తున్నప్పుడు. చేతులు కాళ్లు ఉపయోగిస్తారు. ఏవిధమైన పరికరాలు ఉపయోగించరు. గ్రామసీమల ప్రజల జీవితాన్ని కొంతవరకు ఆనందదాయకం చేయటానికి ప్రయత్నాలు చాలకాలంనుంచి జరుగుతునే ఉన్నాయి. పెద్ద పరిశ్రమలలో అనేక పరిశోధనలు జరిగినాయి. చిన్న పరిశ్రమలలో కూడ జరిగినాయి. వాటి లాభాలు గ్రామసీమలలోని పేదవారు ఇప్పటివరకు పొందలేకుండా ఉండటం చాలశోచనీయము. సమాజం ద్వందసమాజం (Dual society) ఒక మూల పట్టణాలలో ఉన్న 10 శాతం ప్రజలు ఆధునిక సాంకేతిక విజ్ఞానం లభాలు పొందుతున్నారు. మిగత 90 శాతం ప్రజలు గ్రామీణ ప్రాంతాలలో ఉన్నారు. వారు అనుభవిస్తోన్న సౌకర్యాలు చాలా తక్కువ.

గ్రామసీమలలోని ప్రజలకు ఇంకా సాంకేతిక విజ్ఞానం వలన లాభాలు పొందలేదు. కాని పెద్దపెట్టుబడి పరిశ్రమదారులు లాభాలు

పొంది, వారి వారి దీవులు ఏర్పరచుకొన్నారు. రెండిటి మధ్య గొప్ప వ్యత్యాసం ఏర్పడింది. గ్రామసీమలలో, నైపుణ్యం గలవారు దొరకరు. ఆర్థిక ప్రణాళికలు తయారుచేసేవారు గ్రామసీమలలో, ఏ సాంకేతిక విజ్ఞానం ప్రవేశపెట్టిన గ్రామసీమల ప్రజల జీవితాన్ని మెరుగు పరుస్తుందనే విషయాన్ని గురించి ఆలోచిస్తూనే ఉన్నారు. నిజంగా చూస్తే పురాతన పద్ధతులు, ఆర్థిక విధానాలు అనుసరించని ఉత్పత్తి మొదలయినవాటి వల్ల గ్రామసీమలలో పెట్టుబడి ఏర్పడటానికి తావు లేకుండా ఉంది. కొత్తమార్గాలకు పోవడంగాని, కొత్త పరిశ్రమలు స్థాపించటంగాని జరగటం కష్టము. ఉత్పత్తి పెంచవలె, వాళ్ళకు కొన్ని జీవితసౌకర్యాలన్నా అనుభవించేటట్లు చేయవలె. కొంత అయినా డబ్బు వారివద్ద మిగిలేటట్లు ఉండవలె.

ఇక ఏవిధమైన సాంకేతిక విజ్ఞానం ఉపయోగించవలె అనే విషయం మనం ఆలోచించవలె. మధ్యస్థమైన సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించాలని, ఇది పాతపద్ధతులకు, కొత్తపద్ధతులకు మధ్య ఉంటుందని అంటారు. నిరుద్యోగ సమస్యలో మునిగిఉన్న ఈ దేశంలో తక్కువ పెట్టుబడితో, హెచ్చు ఉద్యోగావకాశాలు ఇవ్వాలని మన ముఖ్యోద్దేశము. భారత ప్రభుత్వం "Council for the Application and Extension of Technology in Rural India" అనే సంస్థను స్థాపించినారు. ఈ సంస్థ ముఖ్యలక్ష్యం స్థానికంగా లభ్యమయ్యే వనరులకు ఏ సాంకేతిక విజ్ఞాం సరిపడుతుందో చూసి తగు చర్యలు తీసికొనటం. ఒక్క సారిగా గ్రామసీమలను మార్చడం కష్టమని, అనేక సమస్యలతో కూడివుందని గుర్తించవలె. ఈ మధ్యనే ఈ సంస్థ ఢిల్లీలో ఒక సదస్సు జరిపింది. ఆర్థికంగా ముందంజవేస్తున్న దేశాలు అవి అవలంబిస్తోన్న సాంకేతిక విధానాలను చూసి శాస్త్రజ్ఞులు మోజు పడరాదని, భారతప్రధాని చెబుతూ భారత పరిస్థితులలో, వారి సాంకేతిక విజ్ఞానం గుడ్డెద్దు చేలో పడినట్లు తీసుకోకూడదన్నారు. ఇతర దేశాలు కూడ ఈసంగతి గుర్తించినట్లు భారతప్రధాని అన్నారు. United Nations International Department Organization, ఈ మధ్య ఢిల్లీలో ఒక సదస్సు జరిపి ఏ సాంకేతిక విజ్ఞానం తరలించవచ్చునని చర్చలు జరిపినారు. ఒక్కొక్కప్పుడు సాంకేతిక విజ్ఞానం మనకు సరిపోయేదిగాను ఉంటుంది. వ్యవసాయ పనిముట్లలో కాని, ఇతర

పనిముట్లలో కాని, సాంకేతిక విజ్ఞానం మనమన పరిస్థితులకు పద్ధతులకు అనుగుణంగా ఉండవలె. ముఖ్యంగా గ్రామసీమలలోని సమస్యల గురించి మనం ఆలోచిస్తోన్నప్పుడు, అది ఎంతవరకు తగినది, ఎంతవరకు గ్రామసీమల అభివృద్ధికి తోడ్పడుతుంది అనే విషయాన్ని పూర్తిగా గుర్తించవలె. నిజంగాచూస్తే, సాంకేతిక విజ్ఞానం స్థానిక సమస్యలు పరిష్కారం చేస్తు, స్వావలంబనఉన్న ఆర్థికవ్యవస్థ (Sub reliant ecnomy) కి తోడ్పడుతుంటే మనం దాన్నిచూసి సంతోషించి, బహుకొద్ది మార్పులే తీసుకొని రావలె. సాంకేతిక పద్ధతులకు మన విజ్ఞానానికిచాల సంబంధం ఉంది. ఈ పద్ధతులు మన సమాజ వనరులకు, అవసరాలకు సంబంధించినదై ఉండవలె.వ్యవసాయానికి సంబంధించిన పరిశ్రమలలో దుబారా (Waste) ను మనం చాలవరకు తగ్గించవలె. ఉద్యోగావకాశాలు హెచ్చుగా ఉండేటట్లు చేయవలె. భారత గ్రామీణ ప్రాంతాలలో, మార్పులు తేవాలంటే చాల జాగ్రత్తగా ఉండవలె. మొదట మనం ప్రవేశ పెట్టనున్న సాంకేతిక విజ్ఞానాన్ని గ్రామసీమలలోని ప్రజలకు అర్థమయ్యేటట్లుచేసి, వారికి లాభకారి అవుతుంది అని నచ్చచెప్పవలె. హఠాత్తుగా కొత్తపద్ధతులు ప్రవేశపెట్టటం వల్ల గ్రామసీమలలోని ప్రజల జీవితం అభివృద్ధిచెందదు సరికదా గ్రామీణ పరిశ్రమల వ్యవస్థాపనలో, ఉత్పాదన పెరగదు. గ్రామసీమలలో విద్యుచ్ఛక్తి సులభంగా లభిస్తోంది. ధనిక వ్యవసాయదారులే దాని లాభం పొందుతున్నారు. పనిముట్లు, విద్యుచ్ఛక్తితో నడిపితే అవి సులభంగా మరమ్మతుకు వస్తాయి. సర్వీసు చేయటానికి స్థానికంగా మనుష్యులు లేరు. దానిలో యంత్రం పట్టుకొని పట్టణాలకు తేవాలి. ఈ లోపల వారికి ఎంతో నష్టం రావటానికి వీలుంది. గ్రామసీమలలోని చిన్న చిన్న ట్రాక్టరులు ఇతర యంత్రసామగ్రి, ఈ కష్టాలకే గురిఅవుతున్నాయి. అంతేకాక మన శాస్త్రజ్ఞులు విదేశానికి పోయి, అక్కడ ఉపయోగిస్తోన్న యంత్రాలు తెస్తారు. అవి మన గ్రామసీమలలో ఎంతవరకు ప్రవేశపెట్టవచ్చు, వాటిలాభం ఏమిటీ, వాటిని గ్రామసీమల ప్రజలు ఉయోగించగలరా, ఇదిఅవసరమా, అనే విషయాలు ఆలోచించవలె. పోలీసు శాఖకు సప్లయ్ చేసే తోలు బూట్లకు క్రింద ఉక్కు బటన్లు పెట్టవలసివుండింది. ఇప్పటివరకు బటన్లు చేతితోనే కట్టుతూ ఉండేవారు. కాని యంత్రంతో కుడితే చాల నాణ్యమని,

ఇగ్లాండ్‌లో ఇట్లాచేస్తారని కొంతమంది సాంకేతిక నిపుణులు అనటంతో దానిని 10,000 రూపాయల ఖర్చుతో తెప్పించడం జరిగింది. కొద్దిరోజుల తరవాత, ఇది ఉపయోగింపబడిన యంత్ర మని, కొత్తరంగు పూసి పంపారని తెలిసింది. మరికొన్ని రోజులలో పని చేయలేదు. భాగాలు సులభంగా లభ్యమవలేదు. మరి కొన్ని రోజులలో స్టోర్స్‌లో పారవేయ్యడం జరిగింది. దానివల్ల ఎంత నష్టామో మనం సులభంగా ఉహించవచ్చు. సాంకేతిక నిపుణులు ఈ విషయాన్ని గుర్తించవలె. అట్లాగే పట్టు కాయలనుంచి, పట్టు దారం చాల వరకు చర్ఖాలతోనే తీస్తారు. రీలింగ్ (Reeling) యంత్రాలు ఉపయోగిస్తే, నాణ్యమైన దారం వస్తోంది. కొంత మంది విద్యుచ్ఛక్తి ఉపయోగించవలె. భారి రీలింగ్ (Reeling) యంత్రాలు పెట్టాలంటారు. కాని ఇది గ్రామీణ వికేంద్రీకరణ పరిశ్రమ అని గుర్తించరు. దీనితో చాల డబ్బు ఖర్చుపెట్టు యంత్రాలు తెస్తే, అవిఎంత తొందరగా తెస్తారో, అంత తొందరగా మూల పడతాయి. వాటిపై పెట్టిన పెట్టుబడి నష్టమైతే, దానికి బాధ్యులైన వారి దగ్గరనుంచి ప్రభుత్వం నష్ట పరిహారం పుచ్చుకోవలె

గ్రామీణ పరిశ్రమలంటే, పనికిరాని పద్ధతులు ఉపయోగిస్తున్న పరిశ్రమలుకావు. ప్రజలకు అనువైన పద్ధతులు ఉపయోగిస్తు, సంఘానికి సంతృప్తి ఇస్తోన్న పరిశ్రమలని చెప్పవలె. గ్రామ సీమల ప్రజల ఉపయోగార్థం అనేక వసతులు మనం సమకూర్చవలె. గృహనిర్మాణంలోను, తాగే నీటికిఫిల్టర్స్ (Filters), స్థానికంగా లభ్యమయ్యే వనరులు ఉపయోగించే అవకాశాలు, పెద్ద పరిశ్రమ పనికిరాదని అనే వాటినుంచి, చిన్న చిన్న పరిశ్రమలు, ఎన్నో ఎన్నో ప్రవేశ పెట్టటానికి వీలుంది. మంగుళూరు పెంకులు, ఎలెక్ట్రికల్ విడిభాగలు, వ్యవసాయ దారులు ఉపయోగించే పనిముట్లలో అనేక మార్పులు తేవటానికి వీలుంది.

పశువులపేడ ఉపయోగం విషయంలో ఈమధ్య చాల శ్రద్ధ చూపటం మొదలు పెట్టినాము. మన దేశంలో పశుసంపద 230 మిలియన్ ఉందని అంచనా వేయబడింది. 30,35 మిలియన్ టన్నుల నుంచి ఎంతశక్తి తయారు చేయవచ్చో, పశుసంపద నుంచి వచ్చే పేడలో అంత శక్తి తయారు చేయవచ్చు. గోబర్ గ్యాసు ప్లాంట్‌ల

ద్వారా 850 మిలియన్ల క్యూబిక్ అడుగుల గాసు తయారు చేయటానికి వీలుంది. అంతేకాక మనకు కావలసిన ఎరువు కూడ లభ్యమవుతుంది. రసాయన (Chemical) ఎరువులకంటే ఇవి శ్రేష్ట మైనివని శాస్త్రజ్ఞులు అంటారు. సాంఘిక లాభాల దృష్టితో చూసినా, గ్రామీణ ప్రాంతాలలో గోబర్ గాస్ ప్లాంట్‌లు పెట్టడంలో గ్రామీణ ఆర్థిక ప్రాంతాలకు గొప్పలాభం కలుగుతుందని తెలు స్తుంది. గ్రామసీమలలో ప్రజలకు ఉపాధి సౌకర్యాలు కూడ ఎక్కువ అవుతాయి. భారత ప్రధాని పేడ మొదలైనవి తిరిగి పరిశ్రమకు ఉప యోగించ వచ్చని దీనినే 'Effective Utilisation of Numerable Products' అంటారని చెప్పినారు, సాంఘిక పరిస్థితుల దృష్టితో ఈ విషయాలు పరిశోధన చేయవలె. వంశ పారం పర్యంగా వస్తున్న పరిశ్రమలను పునరుజ్జీవింప చేసి, తగిన సాంకేతిక విజ్ఞానం ప్రవేశ పెట్టవలె. ప్లానింగ్‌లో ముఖ్యం మనిషి అని గుర్తించవలె. మనషులు అవలంబించాలనే సాంకేతిక పద్ధతులు, వీరికి అనుబంధంగా ఉండ వలెనే కాని, అతన్ని పెరికి పారవేయకూడదు.

భారత దేశంలో అనాదినుంచి ఎడ్లబండి ఉంది దాన్ని ఏ విధంగా అభివృద్ధి చేయవలె. ఎద్దు మీదబరువు ఎట్లా తగ్గించవలె అనే విష యాలు చాల కాలంనుంచే శాస్త్రజ్ఞులు ఆలోచిస్తూన్నారు. 13 మిలియన్ల ఎద్దుబండ్లు దేశంలో ఉన్నాయి. 3000 కోట్ల రూపా యలు ఖర్చుపెట్టడం జరిగింది. 20 మిలియన్ల ప్రజలు, ఎద్దుబండి ఆర్థిక విధానంమీద ఆధారపడుతున్నారని అంచనా వేయబడింది. 1 లక్ష కొత్త ఎద్దుబండ్లు, ప్రతీ సంవత్సరం తయారయి, ఉన్న వాటితో కలుస్తున్నాయి. సాంకేతిక మార్పులు దేశంలో ఎన్ని వచ్చినా, ఎద్దుబండ్లలో ఎట్లాంటి మార్పులేదు. ఈ యుగం ముఖ్య లక్షణం వేగము. అయినా ఎద్దుబండ్లు, దేశపు ఆర్థిక విధానంలో అంటిపెట్టు కొని ఉన్నాయి. వీటినుంచి సాలీనా వచ్చే రాబడి 1000 కోట్లనుంచి 2000 కోట్లకు పెంచటానికి ప్రయత్నాలు జరుగు తున్నాయి. గ్రామసీమలలో ఎద్దుబండీ రహదారి సౌకర్యాలకు ఉప యోగపడుతోంది. కొంతమంది టైర్లు, బేరింగ్స్ (Bearings) పెట్టా లంటారు. గాని, అవి పట్టణాలకే ఉపయోగపడతాయని గుర్తించ

వలె. గ్రామసీమల ప్రజలకు, ఇంకా మంచి రహదారి సౌకర్యాలు చాల అవసరము. ఏ విధంగా ఎద్దు బండ్లలో మార్పులు తెస్తే బాగుంటుందో మనం ఆలోచించి తగు చర్యలు తీసుకోవలె.

చేనేత పారిశ్రామికులు నవీన శాస్త్ర సమ్మతమైన పద్ధతులు ప్రవేశ పెట్టరవి, అందువల్ల వారిరాబడి చాల తక్కువగా ఉందని చాల మంది వారి మీద నెపం వేస్తారు. చేనేత పారిశ్రామికులు ఎన్ని బాధలకో లోనవుతున్నారు. వారికి కావలసిన దారం సరిగా సప్లయ్ కాదు.; మరమగ్గాల (Power looms) నుంచి వారికి పోటీ బాగావుంది. వారు ఒక్కొక్కపుడు విదేశ మార్కెట్లకు బట్ట తయారు చేస్తారు. హటాత్తుగా మార్కెట్లు పోతాయి. దానితో వారి ఇక్కట్లు హెచ్చవుతున్నాయి.

భారత ప్రభుత్వం ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హాండ్‌లూమ్ టెక్నాలజీ (Indian Institute of Handlom Technology) స్థాపించింది. ఇది దక్షిణాది రాష్ట్రాల చేనేత పారిశ్రామికులకు ఎంతో ఉపయోగపడుతోంది. వారు అవలబిస్తోన్న పద్ధతులలో మార్పులు తేరు. వారి బట్టకు గిరాకీ లేదని ఎప్పుడు భారత ప్రభుత్వానికి విజ్ఞప్తులు చేస్తారు. ఈ సంస్థ కొత్త డిజైన్‌లు (Designs) పిట్‌లూమ్స్ (Pit looms) కు కూడ లాకప్ మోషన్ అటాచ్‌మెంట్ (Lock up motion attachment) ప్రవేశ పెట్టింది. అంబర్ పేట్ (Ambaerpet) చేనేత సహకార సంఘులలో 6500 సభ్యులున్నారు. దారాన్ని వార్పింగ్, సైజింగ్, డైయింగ్ (Warping, Sizing, Dying), సంఘమే చేసి సభ్యులకు అందచేస్తుంది. చేనేత పరిశ్రమలో కూడ సాంకేతిక విజ్ఞానం ఉపయోగించవలె. వ్యవసాయం తరవాత, ఈ పరిశ్రమే చాల మందికి ఉపాధి సౌకర్యం కలగ చేస్తూఉంది.

ఎటువంటి సాంకేతిక విజ్ఞానం అనువైనది అనేసమస్య గురించి చాల మంది తర్కించినారు అనే విషయం ఇప్పటి వరకు కొంత తెలుసుకొన్నాం కూడా. ఆర్థికంగా అభివృద్ధి అయిన దేశాలు జన సంఖ్య చాలాలేని దేశాలు అవలంబించే సాంకేతిక పద్ధతులను, వెనకబడిన, జనాభా విపరీతంగా పెరుగుతూన్న భారతదేశంలో అవలంబించ వల

సిన పద్ధతి లోను చాలా తేడావుంది. ఆంగ్లేయ ఆర్థిక శాస్త్రవేత్త ఇ. ఎఫ్. ఛమెషర్ (Sehumacher), మధ్యస్థ (Intermediate Technology) అనేమాట వాడినాడు. అంటే ఆర్థికంగా వెనకబడిన దేశాలలో మధ్యస్థమైన సాంకేతిక పద్ధతులు అవలంబించవలె. ఆధునిక విజ్ఞానం ఏదిమన చిన్నపరిశ్రమలలో ప్రవేశ పెట్టకూడదని కొంతమంది వాదన. నవీనత అంటే పెద్ద పెద్ద యంత్రాలు ప్రవేశ పెట్టాలని కాదు. అవి తక్కువ ధరలో గ్రామసీమల ప్రజలకు వారి ఆర్థికాభివృద్ధికి తోడ్పడితే, వాటిని ఖండించటం చాల తప్పు. చిన్న చిన్న పరిశ్రమలలో, ముడి పదార్థాలు సరిఅయినవి ఉపయోగించి చిన్నయంత్రాలు చేతితో ఉపయోగించి, పనికిరావనే వనరులు పరిశ్రమలో ఉపయోగిస్తే, ఉత్పత్తి మార్గాలలో ఎన్నో మార్పులు తేవచ్చు. అరబ్ దేశాలు నూనె ధరలు పెంచటంతో, మనం సూర్యరశ్మి ఉపయోగించటానికి ప్రయత్నం చేస్తున్నాము. కొంతమంది శాస్త్రజ్ఞులు సముద్రంనీరు త్రాగే నీటిగా చేయటానికి ప్రయత్నాలు చేసినారు కాని, ఇది కష్టసాధ్యమని ఇతర మార్గాలద్వారా త్రాగేనీరు లభ్యమయ్యేటట్లు చేసుకొంటే మంచిదని మనం 10 సంవత్సరాల తరవాత నిర్ణయానికి వచ్చినాము. చిన్న యంత్రాలు అంటాంగాని అవి గ్రామీణ ప్రజలకు ఎంతవరకు ఉపయోగిస్తాయి, అభివృద్ధి చెందుతోన్న దేశాలకు అవి నిజంగా అవసరమా అనేవిషయాలు మనం జ్ఞప్తికి తేచ్చుకోవలె. పెద్ద పెట్టుబడిపెట్టి యంత్రసామగ్రి తేవచ్చు. అది అవసరమా? ఎంతవరకు వేగం అవసరం అనే విషయాన్ని మనం గుర్తించవలె. యంత్రాలకై చాలడబ్బు దుబారా ఖర్చుచేసి, వాటిని ప్రజలు ఉపయోగించ లేక పోయిననాడు, శాస్త్రజ్ఞులు దేశానికి తీరని నష్టం చేసినవారు అవుతారు. నిజంగా ఆలోచించి చూస్తే, ప్రజలకు కావలసిన యంత్రసామగ్రి సాంకేతిక విజ్ఞానాన్ని మనం సమకూరుస్తే ప్రజలు తప్పకుండా లాభం పొందుతారు. యంత్రసామగ్రి అసలు అవసరంలేదని మనం చెప్పరాదు. దేశాల పరిస్థితులు మారినాయి. ఆనాడు సరిఅయిన సాంకేతిక పద్ధతులు ప్రవేశపెట్టి, ఉత్పత్తి అనేకరంగాలలో పెంచి, గ్రామసీమల సర్వతో ముఖాభివృద్ధికి మనం తోడ్పడవచ్చు. ఇదే మన పరమావధిగా పెట్టుకోవలె.

ఆర్థిక శాస్త్రవేతలు, తదితరులు పేదవారి సాంకేతిక సమస్యలు పరిష్కారం చేయటంలో వారి తెలివితేటలు ఉపయోగించవలే. గ్రామసీమల అభివృద్ధికి ఎన్నో ఆటంకాలున్నాయి. చాలా గ్రామాలలో ఇప్పటికీ విద్యుచ్ఛక్తిలేదు. రహదారి సౌకర్యాలు కూడా లేని గ్రామాలు ఇప్పటికి ఎన్నో ఉన్నాయి. కావలసిన ముడిపదార్థాలు, సర్వీసు అవకాశాలు కూడ చాల తక్కువగా ఉన్నాయి. గాంధీజీ గ్రామసీమలు నశిస్తే భారతదేశమే నశిస్తుందని, మనం పాశ్చాత్య దేశాలను ఆలోచన లేకుండా కాపీకొట్టకూడదని, సాంకేతిక నవకల్పనలు అందులో ప్రజలకు ఉపయోగపడితే ఆయనకు ఎటువంటి అభ్యంతరం కాదన్నారు. గాంధీజీ పయంత్రమైన గ్రామసీమల ప్రజలు, దాన్ని మరమ్మత్తు చేయటం తెలుసుకొని పని చేయగలిగితే చాల మంచిదని ఆయన అభిప్రాయము.

డాక్టర్ షుమచర్ (Schumacher) గారు ప్రవేశ పెట్టిన మధ్యస్థమైన సాంకేతిక విధానం (Intermediate Technology) ప్రపంచ ఉద్యమం అయింది. పాశ్చాత్య దేశాలు అవలంబిస్తోన్న సాంకేతిక పద్ధతులు అభివృద్ధి చెందుతోన్న దేశాల పేదరిక బాధ తొలగించలేవని ఆయన వాదన. వారిని మనదేశపు ప్లానింగ్ కమిషన్ (Planning Commission), గ్రామీణ పారిశ్రామికీకరణ విషయంలో సలహా ఇవ్వమని ఆహ్వానించనారు. ఆధునిక సాంకేతిక విజ్ఞానం సులభంగా అర్థమయి, అమలుజరపటానికి వీలయినవిగా ఉండవలె. లేకపోతే మనకు సరిపడిన సాంకేతిక పద్ధతులు ప్రవేశ పెట్టుకోవలె.

గ్రామీణ పరిశ్రమలు అభివృద్ధి చెందాలంటే, ఇప్పుడు అవలంబిస్తోన్న సాంకేతిం విజ్ఞానంలో చాల మార్పులు రావలె. కార్మికులకు పూర్తి ఉపాధి సౌకర్యాలు కలుగ చేసేది అయి ఉండవలె. అంతేకాకుండా వీరికి వచ్చేరాబడిలో కూడ అభివృద్ధి ఉండవలె. ఆనాడే వారు గ్రామాలు విడనాడి, పొట్టపట్టుకొని పట్టణాలకువచ్చి, నిరుద్యోగుల లిస్టులో చేరరు. శాస్త్రము, సాంకేతిక విజ్ఞానం చిన్నవారి యోగక్షేమం కోరకపోతే, ఇక ఎప్పుడు చిన్నవారి ఆర్థికస్థితి మెరుగుపడుతుందనే విషయాన్ని మనం తీవ్రంగా ఆలోచించవలె.

ఆర్థికంగా అభివృద్ధి అవుతోన్న భారతదేశంవంటి దేశాలు, ఎదుర్కొంటూన్న సమస్యలు రెండు ఉన్నాయి (1) పాశ్చాత్య సాంకేతిక విజ్ఞానము. దానికి పెట్టుబడి చాలకావలె. కార్మికులు తక్కువకావలె. సొగసైన యంత్రసామగ్రి ఉపయోగిస్తాం. (2) వంశపారం పర్యంగా వస్తోన్న సాంకేతిక విజ్ఞానం క్రమబద్ధంగా ఉండదు. కొంత దుబారా కూడ ఉంటుంది. తగు సాంకేతిక విజ్ఞానం ప్రజల కోరికలు, అవసరాలు మన్నిస్తుంది.

1976 లో ఖరగ్‌పూర్‌లో జరిగిన భారత సైన్స్ కాంగ్రెస్‌లో ఈ విషయాన్ని తీవ్రంగా చర్చించినారు. భారత శాస్త్రీయ, సాంకేతిక విజ్ఞానం ప్రజల అవసరాలు తీర్చటంలో వినియోగించవలెనని దేశంలోని, శాస్త్రజ్ఞులు, పాశ్చాత్య ఐశ్వర్య దేశాల సాంకేతిక విధానాలు చూసి మోజుపడరాదని మనం, మనం స్వావలంబన ఆర్థిక వ్యవస్థ, స్వయం సమృద్ధి సిద్ధాంతంతో స్థాపించుకోవాలని అక్కడ సమావేశమైన అనేక శాస్త్రజ్ఞులు చెప్పినారు. మన సహాజవనరులు గుర్తించి, మనం మన కాళ్లమీద ఆధారపడవలె. అంతర్జాతీయ స్థాయిలో కూడా మన వ్యక్తిత్వం నిలబెట్టుకోవలె. దేశాన్ని స్వయం సమృద్ధం చేసి, స్వావలంబన పద్ధతి అవలంబించిననాడే ఆ పద్ధతివల్ల మనకు తగు లాభాలు వస్తాయి. స్థానికంగా లభ్యమయ్యే వనరులు ఉపయోగించి, ప్రజలకు కనీస సౌకర్యాలు కలగచేయవలె గాని కొద్ది శాతం వారికి అన్ని హంగులు కలగచేసి, చాల మందిని పేదరిక బాధలో ఉంచటం మంచి పనికాదు. సాంఘిక శాస్త్రజ్ఞులు సాంకేతిక విజ్ఞానులు కలిసి ఈ విషయంలో సర్వసమ్మతమైన నిర్ణయానికి రావలె.

అంతర్జాతీయ కార్మిక సంస్థ (International Labour Organisation) సరిగ్గా ఉపయోగించని సాంకేతిక విజ్ఞానాన్ని గురించి ఉదాహరణలు ఇచ్చింది. ఆర్థికంగా అభివృద్ధి అవుతున్న ఒక దేశం, 8 మిలియన్‌ల డాలర్లు విలువగల మౌల్డింగ్ (Moulding) యంత్రాలు తమ చర్మ పరిశ్రమకి దిగుమతి చేసుకొంది. 40 మంది పనివాళ్ళతో ఒక సంవత్సరంలో $4\frac{1}{2}$ మిలియన్‌ల పాదరక్షలు తయారు చేయ కలిగేది, వాటి ధర కూడ చాల తక్కువ పడింది. ఈ చర్యవల్ల,

స్థానికంగా వంశ పారం పర్యంగా ఉన్న 5000 మంది కార్మికులకు పని పోయింది. చేతితో పరిశుభ్రం చేసిన చర్మానికి కూడ గిరాకీ పోయింది. ప్లాస్టిక్ పాదరక్షల పరిశ్రమకు యివన్నీ అక్కరలేదు. దేశంలో పని అవకాశాలు, ప్రజలకు సరాసరి వచ్చే రాబడి ఒక్క సారితో పడిపోయింది. అట్లాగే పెద్దయంత్రాలతో ఆధునిక రొట్టెల కార్ఖానాతో, చిన్న చిన్న కార్ఖానాలు మూసివేయవలసి వచ్చింది.

భారత దేశంలో కూడా మనకు తగని సాంకేతిక విజ్ఞానం గురించి అనేక ఉదాహరణలు ఇవ్వవచ్చు. మధ్య ప్రదేశంలో మేదరి వారికి, వెదురు బొంగులు సప్లయ్ చేయకుండా ఒక కాగితాల కర్మాగారానికి సప్లయ్ చేయటం వలన, మేదరి వారి కుటీర పరిశ్రమ నశించింది. పంజాబ్‌లో కొన్ని సంవత్సరాల క్రితం ఖండసారీ (Khandasari) చక్కెర కార్ఖానలు పనిచేయ కూడదని భారత రక్షణ నిబంధనలు (Defence of India Rules) కింద ప్రభుత్వం ఆర్డర్లు జారి చేసింది. దీని ముఖ్యోద్దేశం పెద్ద చక్కెర కార్ఖానాలు అభివృద్ధి అవాలనే అభిలాష. అట్లాగే చర్ఖాలు, చిన్న చిన్న రీలింగ్ యంత్రాలతో పట్టు కాయలనుంచి దారం తీయవచ్చు. ఆసిల్క్, పట్టు చీరలు నేయటానికి ఉపయోగిస్తారు. విదేశాలలో చదువుకొన్న సాంకేతిక నిపుణులు వీటిని యంత్రాలతో నడిపిస్తే చాల బాగుంటుందని లక్షలాది రూపాయలు వ్యయంచేసి తెస్తారు. కొద్దిరోజులలో అవి పనిచేయవు. రిపేరు చేయాలంటే, బైటనుంచి మనుషులు రావలె. ఈ పరిశ్రమలో కేంద్రీకరణ అక్కరలేదు. అంతేకాదు ఖరీదయిన యంత్రాలు అనవసరము. ఈ విషయంలో ప్రభుత్వం తీవ్రచర్య తీసుకోవలె. పాశ్చాత్య వ్యామోహంతో, కుటీర పరిశ్రమలలో యంత్రాలు తెద్దామనుకొనే వారు, దేశ పరిస్థితులు తెలుసుకో లేదని, వీరి సాంకేతిక విజ్ఞానం మిడిమిడి విజ్ఞానమని అనవచ్చు. మన కార్మికులను, తక్కువ పెట్టుబడితో ఉత్పత్తి కార్యక్రమంలో నిమగ్నులయ్యేటట్లు చేయవలె దీని ఖర్చువగాను, కార్మికులకు పని అవకాశాలు ఇచ్చేదిగాను, స్థానికంగా లభ్యమయ్యే వనరులు ఉపయోగించేదిగాను అయి ఉండవలె. తప్పకుండా ఇప్పుడు ఉపయోగిస్తోన్న యంత్రాలలో మార్పులు తీసుకొనిరావచ్చు. కొన్ని కొత్త నమూనాలు ప్రవేశపెట్టవచ్చు కాని,

ఆర్థికంగా ముందంజవేసిన దేశాలలో ఉపయోగించే యంత్రాల ఖరీదు కంటె తక్కువ అవుతుంది. వీటినే స్వయం సహాయ పద్ధతులు అనవలె. ఇటువంటి పద్ధతులు భారత గ్రామసీమలలో ప్రవేశ పెట్టినట్లయితే తొందరలో గ్రామసీమలలో పేదరికంపోయి, ఆర్థికాభివృద్ధి చెందగలవు.

మనం- ముఖ్యంగా- చదువుకొన్నవారు విదేశాలలో ఉన్న పద్ధతులే సరిఅయినవి అని అనుకొని చూసి తప్పకుండా ఆపద్ధతులు, ఆ యంత్రాలు ప్రవేశ పెడితే దేశానికి చాలనష్టం కలుగుతుంది. "స్వరాజ్యం జీవితహక్కు" అన్నాడు తిలక్ మహాశయుడు. స్వరాజ్యం యొక్క ముఖ్య అవసరం, మన అవసరాలను గురించి మనం ఆలోచించుకోవలె. విద్యా విధానంలోకూడా అనేకలోటు పాట్లు ఉన్నాయి. దానికి కారణం, పాశ్చాత్య దేశాలనుంచి అనేక నమూనాలు మనం తీసుకొన్నాము. అవి ఎంతవరకు భారత దేశానికి నప్పుతాయి అనే విషయం గురించి మన విద్యావేత్తలు ఎంత మాత్రం ఆలోచించలేదు. ప్రతిదానికి మనం యూరోపియన్ లేబుల్స్ కోసం చూస్తాం. శాస్త్రీయ ప్రయోగశాలలకు, ప్రజలకు మధ్య సన్నిహిత సంబంధం ఉండవలె. మనదేశం చాల పెద్దదేశం, ఒకరికి ఇంకొకరికి చాల దూరం ఉంది. దానితో పరస్పరం తెలుసుకొనే అవకాశాలు ఉండవలె. పరిశోధన లాభాలు సామాన్య మనుషులు పొందవలె. ఇవి పారిశ్రామిక సంఘానికి ఉపయోగపడవలె. సాంకేతిక మార్పులు ఎప్పుడు అవుతూనే ఉంటాయి. అది చాల అవసరం కూడా. ఈ విషయంలో భారతదేశం చాల దూరం ప్రయాణం చేయవలె.

అందుచేత భారత దేశంలో తగు సాంకేతిక విజ్ఞాన ప్రాజెక్టులుచాల అవసరము. శాస్త్రజ్ఞుడు అంతా తనకు తెలుసునను కొంటాడు. ఆర్థిక సాంఘిక ఆచార్యులతోకూడ చర్చించినట్లయితే శాస్త్రజ్ఞానం చాల బాగుంటుంది. అందుచేతనే అంతర్జాతీయ సంస్థ పథకాలలో (United Nations Projects) ఆర్థిక శాస్త్రవేత్త, గణాంక శాఖలో ప్రావీణ్యం ఉన్నవాడు, శాస్త్రజ్ఞుడు ముగ్గిరిని ప్రాజెక్టు రిపోర్ట్లు వ్రాయటంలో వినియోగించినారు. దీనివల్ల అనేక లాభాలు

ఉన్నాయి. సాంకేతిక విజ్ఞానం మనం గ్రామసీమలకు తీసుకుపోవలె. వారి అనుభవానికి, అవసరాలు తీర్చేదిగా ఉండవలె.

ఇదంతాచూస్తే తిరిగి మనం అర్థికాభివృద్ధి గాంధేయ సిద్ధాంతాలను మనం దృష్టిలోకి తీసుకోవాలా అనిపిస్తుంది. ఏ పద్ధతి అయినా వస్తువుధర పెంచకూడదనేవాడు గాంధీజీ. ఇప్పటి ప్రజల విజ్ఞానంతో సరిపడి ఉండవలె. గ్రామసీమల కోరికలు అక్కడి సమస్యలు గురించి మనం తగుచర్య తీసుకోవలె. సాంకేతిక విజ్ఞానం, స్థానికంగా లభ్యమయ్యేవనరులతో, సాంఘిక అవసరాలతోను సంబంధం ఉండవలె. సంఘంలో మార్పులు రావాలంటే, ఒక దేశంనుంచి ఇంకోదేశానికి సాంకేతిక విజ్ఞానం తరలించటం కాదు. నిజంగాచూస్తే "అనువైన సాంకేతిక పద్ధతి" (Apprapriate technology) మధ్యస్థమైన సాంకేతిక పద్ధతి" (Intermediate technology) "సంగతమైన సాంకేతిక పద్ధతి" (Relavent technology) అనే పాశ్చాత్య పదాలను గురించి మాట్లాడటానికిబదులు, గాంధేయ సాంకేతిక విజ్ఞానం మనం తెలుసుకొంటే బాగుంటుంది. గ్రామీణ పరిశ్రమలను నశింప చేసినాంకనకి ఆర్థికంగా మనం అనేక కష్టాలకు లోనైనాము. కోరికలు హెచ్చుచేసే పరిశ్రమలు మనం స్థాపిస్తున్నాము. దానితో సామాన్య మానవులకు కావలసిన అవసర వస్తువులు దొరకటం చాల కష్టమైంది. ఉక్కు, బొగ్గు, ఖనిజ పరిశ్రమలో పెద్దపెట్టుడి పరిశ్రమలు అవసరంకాని, ఆహారం బట్టలు, గృహ నిర్మాణవస్తువులలో గాంధేయ పద్ధతులు వికేంద్రీకరణ పద్ధతులు అవలంబించవలె.

విద్యార్థులుకూడ గ్రామసీమల అభివృద్ధికి ఎంతో తోడ్పడవచ్చు. అక్కడి కళాకారుల కష్టనిష్టురాలు తెలుసకొని, వారి ఉత్పత్తిలో అవలంబిస్తూఉన్న పద్ధతులలో కొన్ని మార్పులు తేవచ్చు. సాంకేతిక విజ్ఞానంలోకూడ మార్పులు తేవచ్చు. అంతేకాకుండా గ్రామసీమలలో లభ్యమయ్యేముడి పదార్థాలు, ఆయా ప్రాంతాలలోనే, కుటీరపరిశ్రమలలో ఉపయోగిస్తే బాగుంటుంది. దానివల్ల వస్తువుల ధరలుకూడా తగ్గుతాయి. గ్రామసీమలలో తయారయిన దంపుడు బియ్యం, తేనే, చెప్పులు, తాళ్లు, గానుగ నూనె, సబ్బులు ఇంకా ఎన్నోవస్తువులు ప్రజలు కొనేటట్లు చేయవచ్చు.

ఈ విధంగా తీరిక కాలంలో-ముఖ్యంగా శెలవులలో-విద్యార్థులు గ్రామాభివృద్ధికి ఎంతో తోడ్పడగలరు. ఈ నాటి విద్యార్థులు, రేపటి పౌరులు ఇప్పటినుంచి గుర్తించి, బాధ్యతలు నిర్వహించినట్లయితే సంఘం అనతి కాలంలో బాగుపడగలదు.

గ్రామీణపరిశ్రమలు శాస్త్రయుక్తంగా అభివృద్ధి చెందవలె. వాటి అవసరాలనుబట్టి, వనరులనుబట్టి కొత్తరకపు సాంకేతిక పద్ధతులు మనం ప్రవేశ పెట్టవలె. నూతన ఆర్థిక కార్యక్రమాలు అమలు జరపాలంటే, మనం తిరిగి గాంధేయ సిద్ధాంతాలకు పోవలె. మొన్నటివరకు ఉన్న సాంకేతిక పద్ధతులు సాధారణంగా (Simple) గా ఉండేవి. గాంధిజీ 1940 ఆ ప్రాంతంలో, ఆర్థిక ప్రగతి మననాగరికతకు, సంస్కృతికి సంబంధించిందిగా ఉండాలని చెప్పేవాడు. మనం మన శాస్త్రపరిశోధనశాలలో పరిశోధనలు జరుపుతున్నప్పుడు, ప్రజలు వారి అవసరాలు కోరికలు గుర్తించవలె. సాంకేతిక పద్ధతులు, ముడి పదార్థాలు, సాంఘిక అవసరాలు, ప్రజల పనితనము మొదలైన వాటికి అనుబంధంగా ఉండవలె. ఇష్టం వచ్చినట్లు విదేశాలనుంచి సాంకేతిక పద్ధతులు దిగుమతి చేసుకోవటం, విదేశ సహకార ఒప్పందాలు దేశానికి హానిచేస్తాయి. దానిలో యువజనులు గొప్పపాత్ర వహించగలరు. సాంఘిక మార్పుకువారు దూతలు కావటానికి మంచి అవకాశం ఉంది.

పేద దేశాలలో ఒకటైన భారతదేశం, తనకుతగ్గ సంస్కృతి సాంకేతిక విజ్ఞానం పెంపొందించుకోవలె. కొద్ది కార్ఖానాగారాలు, ఉత్పత్తి అవకాశాలతో దేశం ఆర్థికాభివృద్ధి చెందిందని చెప్పలేము. దేశంలో పరిశ్రమలు నెలకొల్పటం, కార్మికుల ఉత్పాదక శక్తి హెచ్చు చేయటం దేశంలో కొత్తపారిశ్రామిక సంస్కృతి ప్రవేశపెట్టటం ఈ మధ్యనే జరిగింది. ఇవన్నీ సాధిస్తే, పారిశ్రామిక పథకాలు జయప్రదంగా అమలు జరుగుతాయి. కొద్దిచోట్ల మాత్రమే పరిశ్రమలు అభివృద్ధి చెందితే, సామాన్య ప్రజలకు అంతలాభదాయకంగా ఉండవు. మనుష్య సంపద, ప్రకృతి సంపద అభివృద్ధి చేయటానికి ఎన్నో అవకాశాలున్నాయి. మనకు ఒకే రకపు సాంకేతిక పద్ధతి అక్కరలేదు. అన్నిరకాల సాంకేతిక విజ్ఞానాన్ని మిళితం చేయవలె.

పాత పద్ధతులు, కొత్త పద్ధతులు సమన్వయం చేయవలె. మన అంగ బలం ఇతర దేశాలతో పోల్చిచూస్తే, ఎంత మాత్రం తగ్గిపోదు. భారతదేశం నుంచి విదేశాలకు పోయిన వారు, అక్కడ వారి మెప్పు పొందుతున్నారు.

మన మనస్తత్వం ఏమిటంటే, పాశ్చాత్య దేశాలు మనకు సర్టిఫికేట్ ఇస్తేనేమనం గొప్పవారమను కొంటాము. ఈ తత్వం పోవలె. మనబలంమీద ఆధారపడుతూ ఉండవలె. మన దేశానికి ఎంతో కష్టపడి స్వాతంత్ర్యం సంపాదించినాము, అట్లాగే ఆర్థికాభివృద్ధి సాధించవలె.

వెనకటి భారత అధ్యక్షుడు కీ॥ శే॥ ఫక్రుద్దీన్ అలీ అహమద్ గారు, (Delhi Indian Institute of Technology) స్నాతకోత్సవంలో ప్రసంగిస్తూ, వచ్చే పది సంవత్సరాలలో సాంకేతిక విజ్ఞానంతో ప్రజల కనీసపు కోరికలు తీర్చాలని, పేదరికం జబ్బు, చదువు రాని తనం పోవాలని ఆయన అన్నారు. ఇప్పటివరకు గ్రామసీమలు ఆర్థికంగా వెనకబడి ఉన్నాయంటే, సరిఅయిన సాంకేతిక సహాయం వారికి అందలేదన్నమాట. సాంకేతిక విజ్ఞానం మన ఆర్థిక సమస్యలు పరిష్కారం చేయవలె. మన తక్కువగాఉన్న సహజ వనరులను చాల జాగ్రత్తగా ఉపయోగించుకోవలె. పరిశోధనలు, ఒక కార్యక్రమం జయప్రదంగా జరిగేటట్లు చేయవలె. ప్రజల జీవితాన్ని ఎట్లాగైనా మెరుగుచేయవలె, కనక తగిన సాంకేతిక పద్ధతులు, గ్రామీణ పారిశ్రామికరణకు ఎంతైనా అవసరము.

# 5

# చిన్న పరిశ్రమలు - గ్రామీణ పారిశ్రామికీకరణ

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరవాతనే ఇతర వికేంద్రీకరణ చిన్నపరిశ్రమలతోబాటు, ఖాది, గ్రామీణ పరిశ్రమలకు కూడ స్థానం ఇచ్చినారు. చిన్న పరిశ్రమలు అనే పదంలో ఖాది గ్రామీణ పరిశ్రమలు, చేనేత పరిశ్రమ, పీచు పరిశ్రమ, చేతి పరిశ్రమ, సిల్కు పరిశ్రమ. ఇతర చిన్న తరహా పరిశ్రమలు ఇమిడి ఉన్నాయి. వీటన్నిటిలో ముఖ్యమైనవి ఖాది గ్రామీణ పరిశ్రమలు. బ్రిటిష్ వారి కాలంలో మన ప్రాచీన కళలు, పరిశ్రమలు నశింపచేసినారని ఇది వరకే తెలుసుకొన్నాము. ఖాదీ గ్రామీణ పరిశ్రమలు గాంధిజీ నిర్మాణ కార్యక్రమంలో ఇమిడి ఉన్నా, రాజకీయంగా భారత సంఘానికి స్వాతంత్ర్యం వచ్చినా ఆర్థికంగా కూడా స్వయం సంపూర్ణంగా ఉండాలని, ఈ సంఘం అహింసా సిద్ధాంతం మీద ఆధార పడాలని, ఆయన వాదన. గాంధీజీ ప్రకారం ఖాది గ్రామీణ పరిశ్రమతో సంఘములలో అసమానత్వం పోతుంది. నిరుద్యోగ సమస్యకూడా పరిష్కారమవుతుంది. దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చేయాలంటే గ్రామసీమలలో మాత్రం చిన్న పరిశ్రమకే సహాయకారి అవుతాయి.

గాంధేయ అర్థ శాస్త్రం వికేంద్రీకరణ పద్ధతిపై ఆధారపడి ఉంది. భారతదేశం వంటి పెద్ద దేశంలో వికేంద్రీకరణ ఎంతైనా అవసరము. నిరుద్యోగ సమస్య పరిష్కారం చేయాలంటే గ్రామీణ పరిశ్రమలు ఎంతైన అవసరము. మొదటి ప్రణాళికా మొసాయిదా ప్రణాళికా సంఘంలో, (Planning Commission) చిన్న తరహా కుటీర పరిశ్రమలు ఉపాధి సౌకర్యాలు కలగచేయగలవని పేర్కొనడం జరిగింది. టాంజానియా, ఘనా (Tanzania, Ghana) మొదలైన ఇతర దేశాలు కూడా గ్రామీణ పరిశ్రమలు అభివృద్ధి చేయటానికి తలపెట్టటం,

ఖాదిక మిషన్ సహాయం అపేక్షించటం, సంతోషించ వలసిన విషయము. ఖాదిక మిషన్ కూడా కొత్త రకపు అంబర్ చరఖా, విద్యుచ్ఛక్తితో నడిపే నూనె గానుగలు, చేతి కాగితాలు కొత్త పద్ధతితో చేయటం, గోబర్ గాస్ ప్లాంట్ మొదలైనవి నెలకొల్పినారు.

ఆర్థికాభివృద్ధికి, సాంఘిక విలువలకు చాల సంబంధముంది. సంఘం స్వయంశక్తి మీద ఆధార పడవలె. వికేంద్రీకరణ పరిశ్రమలలో ఖద్దరు ముఖ్యమైనది, అట్లాగే గ్రామీణ పరిశ్రమలు కూడా గ్రామాల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడగలవు. వివిధ పంచవర్ష ప్రణాళికలు, ఖాదిగ్రామీణ పరిశ్రమల ప్రాముఖ్యాన్ని గుర్తించినారు. ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడు గ్రామీణ పరిశ్రమలు ఆర్థికంగా స్వయం సంపూర్ణంగా ఉండాలని, కొత్త సాంకేతిక పద్ధతులు అనుసరించవలెనని హెచ్చరించినారు.

ఖాది, గ్రామోద్యోగ కమిషన్ కార్యకర్తలకు తరిఫీదు సౌకర్యాలు, ముడి పదార్థాల సరపరా, మార్కెటింగ్ సౌకర్యాలు, పరిశోధనలు ఉత్పత్తిలో అవలంబిస్తున్న పద్ధతులలో మార్పులు, ఇది వరకున్న సంఘాల స్థాపన మొదలైన అంశాలు దీని ఆశయాలుగా పేర్కొనడం జరిగింది.

ఖాది కమిషన్ చాల మందికి ఉపాధి సౌకర్యాలు కలగచేసింది. కొత్త సాంకేతిక పద్ధతులు ప్రవేశ పెట్టటంతో కార్మికుల వేతనాలు కూడ పెరిగినాయి. జాతీయ ప్రణాళిక ప్రకారం, పేదరికానికి కారణాలు 1. నిరుద్యోగిత 2. తక్కువ పని సౌకర్యాలు 3. తక్కువ అవకాశాల అభివృద్ధి, సాంఘిక న్యాయంతో కలిసి ఉంది. ఆర్థికాభివృద్ధి స్వావలంబనమై ఉంది. ఖాది కమిషన్, రాష్ట్ర బోర్డులు కలసి ఖాది గ్రామోద్యోగ పరిశ్రమల అభివృద్ధికి ఎంతో తోడ్పడుతున్నాయని చెప్పవచ్చు.

భారత దేశపు గ్రామీణాభివృద్ధికి, గ్రామీణ పారిశ్రామికరణ చాలా అవసరము. గ్రామీణ వనరులు బాగా ఉపయోగించిననాడే గ్రామసీమలు అభివృద్ధి అవటానికి వీలుంది. ఇవి భారత దేశపు ఆర్థిక సాంఘికాభివృద్ధికి ఎంతో తోడ్పడు తున్నాయి. భారత దేశంలో

218 మిలియన్‌లమంది ప్రజలు పేదరిక బాధలో ఉన్నారు. గ్రామీణ పారిశ్రామికీ కరణంలో ఖాది, గ్రామద్యోగ పరిశ్రమలకు కూడలి స్థానం ఉంది. గ్రామీణ పారిశ్రామికీకరణ గ్రామసీమలకు సౌభాగ్యం కేవటమేకాక, పట్టణాలు, గ్రామసీమలమధ్య ఒకవిధమైన ఐకమత్య భావం కల్గింస్తుంది. ఏది ఎట్లున్నా పాతవద్ధతులనే అనుసరించవలెనని ఎవరు చెప్పరు. కాని మనం పాతలోమంచి గ్రహించి, భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని వ్యవహరించవలె.

## చేతి పనులు

సౌందర్యంగల వస్తువులెప్పుడు, ఆనంద ప్రదమేఅనేమాట మనం ఎప్పుడు వింటూనే ఉంటాము. అనాదిగా మానవుడు అందమైన వస్తువులకోసం, కళల కోసం ఆకాంక్షిస్తూనే ఉన్నాడు. మట్టి వస్తువులు, పేడుబొమ్మలు పేదవారి అభిమానానికి మాత్రమే నోచుకొంటే, అంతకన్న స్తోమతగల సంపన్నులు ఖరీదైన వాటిని కొనవచ్చు. భారత చేతిపనులలోని నిరాడంబర సౌందర్యంలో తరతరాల, యుగయుగాల భారతీయ సంప్రదాయాలు ప్రతిబింబిస్తున్నాయి. ఆపనివారిని సంఘం ఆదరించింది, సంపన్నులు అభిమానించినారు.

ఆంధ్రప్రదేశ్‌ను తీసుకొంటే, భారతదేశపు చేతిపనులకు ప్రతిబింబమని, దయార్ద్రహృదయులని, అతి సున్నితమైన దారం చేతితో తీయగలరని గాంధీజీ తన వార పత్రిక యంగ్ ఇండియా (Young India) లో ఒక సారివ్రాసినాడు. ఆంధ్రులలో నూటికి 70 మందికి పైగా వ్యవసాయం మీదనే ఆధార పడుతున్నారు. చేతిపనులలో కూడా చాలమంది నిమగ్నులై ఉన్నారు. చేతిపనుల అభివృద్ధికి అఖిల భారత చేనేత పనుల సంస్థకు ప్రభుత్వం స్థాపించింది. కళాకారులు పట్టణాలకు వలసరాకుండా వారిగ్రామాలలోనే నవీనశాస్త్ర సమ్మతాలైన పరికరాలు ఇచ్చి, సాముదాయిక సదుపాయ కేంద్రాలు ప్రభుత్వం స్థాపించింది. నిర్మల్, కొండపల్లి, వరంగల్, ఏలూరు, ఏటి కొప్పాక, హైదరాబాదు పట్టణాలలో ప్రభుత్వం ఇటువంటి సదుపాయాలు కలగచేసింది. విదేశీయులు మన సరుకులు మెచ్చు

కొన్నపుడే మనం మురిసిపోతాము. తరవాత మరుస్తాం. చేతి పనులు, మనరాష్ట్రాలలో వర్ధిల్లినాయి. మన సంస్కృతిలో చేతిపనులు ఇమిడివున్నాయి. కళాకారులు వారి చేతులతో బ్రహ్మాండమైన పనులు చేయగలరు. అక్షరజ్ఞానం లేకపోయినా, బ్రహ్మాండమైన చేతి పనులు చేయగలరు. ఉన్ని తివాసి నేతలో కాని, కొండపల్లి బొమ్మల తయారిలో కాని, ఏ ఇతర చేతిపనిలో కాని, గణితశాస్త్రవిజ్ఞానం, తత్వశాస్త్రజ్ఞానం ఇతర శాస్త్రాలజ్ఞానం, కావలసివుంది. వారికి గవ్యాృమే పాఠశాల, అనుభవమే గొప్పసొత్తు.

పంచవర్షప్రణాళిక లెన్నివచ్చినా సమాజ వికాస కార్య క్రమాలు జరుగుతూనే ఉన్నా గ్రామీణ ప్రాంతాలలో పరిస్థితి అసంతృప్తిగానే ఉంది. పనిలేనివారు పనికోసం పట్టణాలకు వచ్చే యటం జరుగుతోంది. పెద్ద పరిశ్రమల తాకిడి గ్రామసీమలపై కూడా పడుతూఉంది గ్రామసీమలు విడిచి పట్టణాలకు వస్తున్నారు. కాని మనంవారి వారసత్వం నశించకుండా చూడవలె.

ఆంధ్ర ప్రదేశంలోని ప్రతి చేతిపనికి ప్రత్యేకత, విశిష్టత ఉంచి సత్ఫలితాలు కలగాలంటే చేతిపనుల విషయంలో క్రమబద్ధమైన చర్యలు తీసికోవలె. ముడి సరుకుల సరఫరా పరికరాల వినియోగం నమూనాలు సమకూర్చటం విక్రయశాలలు- ఇవన్ని పరస్పర సంబం మున్న విషయాలు. సంప్రదాయ సిద్ధంగా మన చేతి పరిశ్రమలు అభివృద్ధిచేయవలె. ఉత్పత్తి విధానంలో, అభివృద్ధి అంటే యంత్రా లను, మానవశక్తి ఆవశ్యత తగ్గించే సాధనాలను విచక్షణ లేకుండా వాడమనికాదు. మనకు నమూనాల కొరతలేదు. అజంతాఎల్లో రా, లేపాక్షి ఎన్నో నమూనాలు ఇస్తున్నాయి. ఉత్పత్తి ప్రమాణ బద్ధం చేయటానికి నాణ్యతా నిర్దేశం (Quality Marking) చాల అవ సరము. పనులు మన సాంస్కృతిక సాంప్రదాయిక చిహ్నాలు. అవి మన రాయబారులవలె ఇతర దేశాలలో వ్యవహరించి పరస్పర స్నేహ సంబంధాలు నెలకొల్పటంలో ఎంతో తోడ్పడగలవు.

మనరాష్ట్రం చేతిపనులకు ప్రసిద్ధిచెందింది. మనకళలు దేశ దేశాలలో వాసికెక్కినాయి. మన చేతిపనులలో అందం చందం

కూడ ఉంది. కొంతమంది యంత్రయుగంలో, చౌకగా దొరికే వస్తువులను కొనుక్కొని, వాడుకోకూడదా అంటారు. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే, మానవ జీవితానికి, కళకు ఉండే సంబంధం తెలియవలె. కళలు ఆనందం కోసమే వాటి స్పర్శవల్లనే హృదయం ఉప్పొంగుతుంది. మనమనస్సు వికసిస్తుంది. ఏ ఇంట్లో అయినా చేతితో చేసిన వస్తువులు ఉన్నవాడే, ఇంటికి హంగు చూడవచ్చిన వారికి ఆనందము. మన చేతి పరిశ్రమలు గ్రామీణ జీవితంలోను, భారత సంస్కృతిలోను ఒక భాగము. గ్రామీణ కళాకారులు, విద్యావంతులు కాకపోయినా, వారు ఎంత సంస్కారవంతులో, వారి కళలు చేతి పరిశ్రమలు చెప్పగలవు. ఇవి మనం దాచిపెట్టుకొన్న ఆస్తి. వీటిని పోషించి, మననాగరికత, సంస్కృతులను ఇతరులకు చెప్పవలసిన బాధ్యత మనపై ఉంది.*

చేతి పరిశ్రమల రంగంలో. భారత దేశానికి అగ్రస్థానం ఉన్నట్లు భారత దేశంలో ఆంధ్ర ప్రదేశ్ అగ్రస్థానం పొందింది. మన రాష్ట్రంలో ఉన్నన్ని వివిధ రకాల చేతి పరిశ్రమలుకాని, నిర్మాణ చాతుర్యంగాని, ఏ ఇతర రాష్ట్రంలోను లేవు. వీటిలో మన సంస్కృతి, సంప్రదాయాలు, ఇతర రాష్ట్రాలకేకాక విదేశాలకు కూడా పోయినాయి. ప్లాస్టర్ బొమ్మలు ఎక్కడైనకావచ్చు. కాని సహజ సౌందర్యం వెదజల్లే వస్తువులు దొరకటం చాల కష్టం.

ఎంత మనంవిదేశ మార్కెట్లకు మన సరకులను ఎగుమతి చేసినా స్వదేశ మార్కెట్లు విడనాడరాదు. మనరాష్ట్రంలోనే మన చేతివస్తువులకు గిరాకీఉంది.

మార్కెట్ల విషయం ఎట్లాఉన్నా, కళాకారులకు, అవి తగు ఉపాధి సౌకర్యాలు మాత్రం కలగచేయటంలేదు. గ్రామసీమలలో లభ్యమయ్యేమట్టి, దారం, గడ్డి, కట్టె, రంగులు, కళాకారులు ఉపయోగించి మంచి బొమ్మలను, చాపలను లేసులను, తదితర

---

* చేతి పనుల ననుసరించి సమగ్రంగా, తెలిసికోవాలంటే, ఈ గ్రంథ కర్త రచియించిన "భారతీయ చేతి పరిశ్రములు" (ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచారణ, చదవండి). భారత ప్రభుత్వం ఈ గ్రంథానికి బహుమతి కూడ ఇచ్చింది

వస్తువులను తయారుచేస్తున్నారు. కళాకారులు వారి మనస్సుకు ఏంతో పని చెప్పవలసి ఉంటుంది. అంతేకాదు. వారిచేతులు "మ్యాజిక్ చేతులనవచ్చు. ఆంధ్ర ప్రదేశంలో వివిధ ప్రాంతాలలో కుండలు చేయటంచూడండి, రంగులఅద్దకం చూడండి. స్థానికంగా లభ్యమయ్యే ముడిపదార్థాలు ఎట్లా ఉపయోగిస్తున్నారో చూస్తే చాల వింతగా ఉంటుంది. గొర్రెపొట్టేలు ఉన్నితో మంచికంబళ్లు నేస్తారు. వీటిలో వీరి కళానైపుణ్యాన్ని ప్రదర్శిస్తారని వ్రాస్తే అతిశయోక్తి కాదు. ఏమి చదువురాని కళాకారుడు, ఇన్ని విచిత్రమైన వస్తువులను చేస్తున్నాడంటే మనం గర్వించదగిన విషయం. ఆంధ్రులపూర్వీకులే అజంతా ఎల్లోరా (Ajantha Ellora) కట్టడాలకు, చిత్రాలకుకారణభూతులని వ్రాస్తే గర్వించని ఆంధ్రుడుఉంటాడా?

మనడిజైనులు, రంగులు, నిర్మాణాలు, కొన్ని శతాబ్దాల పరిశోధన ఫలితమే అనివ్రాయవలె. ఇవన్ని ఒకనాడు చేసినవికాదు. ప్రతి యుగంలోను క్రొత్త క్రొత్త ముడిపదార్థాలు ఉపయోగించటంలో గాక, ఒక యుగంలో రాతిమీద, ఒక యుగంలో రంగులమీద, ఇంకొక యుగంలో ఇంకోదానిమీద పరిశోధనలు చేసేవారు. అదిలాబాదు జిల్లా నిర్మల్ గ్రామంలో కొన్నిస్థానికంగా లభ్యమయ్యేముడిపదార్థాలనుంచి బంగారంరంగువంటి రంగు తయారు చేసి, బొమ్మలపై, పల్లకీలపై, మంచాలపై పూసేవారు*. దాని రంగు ఎప్పుడూ మాసిపోయేదికాదు. బిద్రికళావస్తువులు చేసేటప్పుడు ఒక మట్టి రంగులోవేసి, వేడిచేస్తే దానిరంగు నల్లగా మారుతుంది. పొనక కర్రతో శ్రేష్టమైన ఆట బొమ్మలు తయారు చేయవచ్చు. లక్క ఆటసామానుకు మొగలి ఆకుతో పాలిష్ చేస్తారు. రత్నకంబళ్లను గొర్రె బొచ్చుతో తయారు చేస్తారు. ఈ విధంగా ఆంధ్ర

---

* "The evolution of design, colour, and foam embodied in our Handicraftst is a story of experiments and evolution through centuries, perfected through the passage of times" Dr. R. V. Rao Handicrafts of Andhra Pradesh **page 26.**

ప్రదేశంలో స్థానికంగా లభ్యమయ్యే ముడి పదార్థాలు, చేతిపనులలో విరివిగా ఉపయోగిస్తారు. ఇట్లా ఉపయోగించు కొనక పోతే కొన్ని వ్యర్థమయ్యేది కూడా. గ్రామసీమలలో ఇవి ఇంకా వర్ధిల్లు తున్నాయి. అందుచేతనేఇవి భారతీయ సంస్కృతికి దృష్టాంతాలని చెప్పవచ్చు.

మనరాష్ట్రం చేతిపనుల అభివృద్ధిలో గొప్ప విశిష్టత జూపింది. అంతేకాదు ఇతరరాష్ట్రాలకు మార్గదర్శి అయింది. రాష్ట్ర ఆర్థిక విధానంలో ఇవి గొప్ప పాత్ర వహిస్తున్నాయి. ఈ చేతిపనుల వ్యవస్థలోకూడ ఒక ప్రత్యేకతఉంది. వాటిని సహకార పద్ధతులతో నిర్వహించటానికి ఎంతో ప్రయత్నం చేస్తున్నాము. సంప్రదాయ పద్ధతులు, నమూనాలను దృష్టిలో ఉంచుకొని కొత్తవస్తువులు, బరువు పరిమాణం తగ్గించి తక్కువ ధరలకు అమ్మటానికి ప్రయత్నం చేస్తున్నారు. ఆధునిక యుగంలో ప్రజలఅభిమతాలనుకూడ మనం గుర్తించవలె. పాత పద్ధతులే మంచి వనకూడదు. గొప్పకళాకారులు ఇతర దేశాలనుంచి మనదేశానికివచ్చి, మన చేతి పనులను కొనియాడి నారు. భారత దేశపు చేతిపరిశ్రమల పటంలో మనరాష్ట్రానికి ఉన్నత స్థానం ఉంది.

మన రాష్ట్రలో కొన్ని చేతిపనులు గురించి కొంచెం తెలుసు కొందాము. ఆటబొమ్మలకు ఒక ప్రత్యేకతఉంది. నిర్మల్ కట్టె సిం హాన్ని చూస్తే, అదినిజం సింహామని పిల్లలు భయపడతారు. అట్లాగే కొండపల్లి బొమ్మలు మనుషుల నిజస్వరూపం చూపుతాయి. దసరా సంక్రాంతి సందర్భాలలో బొమ్మల కొలువులు కూడాపెడతాం. తిరు పతి ఎఱ్ఱ చందనం బొమ్మలు చూడటానికి చాల సొంపుగా ఉంటాయి. ఏటికొప్పాక లక్కసామాన్లు కర్ణాటక చెన్నపట్నం లక్క సామాన్లలాగ ఉంటాయి. కొండపల్లిలో పశులు, వృత్తులు, పేరానికి బొమ్మలు మొదలయినవి తయారు చేస్తున్నారు. వేగన్న కొద్ది బొమ్మలకు గిరాకీఉన్నా ఉత్పత్తి పెంచలేకుండాఉన్నాం. ఈ బొమ్మలు చూస్తే భారత ప్రజా జీవితం చదివినట్లే అనవచ్చు, బొమ్మలు మన దగ్గరఉంటే, అవిమన భాషలో మనతో మాట్లాడు తున్నట్లే ఉంటుంది. కాగితపు గుజ్జుతో బొమ్మలు చేస్తారు.

వాటికి స్ప్రింగ్ (Spring) పెట్టి ఆ బొమ్మల చేతనృత్యం చేయిస్తారు. వీటినే నాట్యమాడే బొమ్మలు (dancing dolls) అంటారు.

మన రాష్ట్రంలో తివాసీలుకూడ తయారు చేస్తారు. వరంగల్, ఏలూరు వీటికి ప్రసిద్ధి కెక్కిన కేంద్రాలు. మనరాష్ట్రంలో ఉన్ని బాగా లభ్యమవుతుంది. కొన్ని సంవత్సరాల క్రితం బందర్‌లో కూడా మంచి తివాసీలు తయారుచేసేవారు. ప్రజల కొనుగోలు శక్తి పెరిగాక తివాసీలు కొంటున్నారు. సామాన్య ప్రజలు ఉన్నితో చేసిన కంబళ్లను వాడతారు. వాటికి ఇతర ప్రాంతాల కాఫీ, తోటలలో మార్కెట్లు బాగా ఉన్నాయి.

అట్లాగేబందరు కళంకారి అద్దకానికికూడా కొన్ని శతాబ్దాల మంచిపేరు ఉంది. నర్సాపురం మొదలైన రేవు పట్టణాలనుంచి, వాటిని ఎగుమతి చేసుకొని, విదేశ మారకం సంపాదించేవాళ్ళమని చరిత్రకారులు చెబుతారు. కాళహస్తిలో చేసిన గుడ్డపై రామాయణం సూచించే గుడ్డ ఇప్పటికీ ఢిల్లీ నేషనల్ మ్యూజియమ్ (National Musium) లో ఉంది.

పోచంపల్లిలో దారాన్ని ముడికట్టి ఇతర భాగాలకు రంగులు వేసి, వివిధ రంగులు వచ్చేటట్లు చమత్కారంగా చీరలు నేస్తారు. ఘూదానానికి ప్రసిద్ధికెక్కిన ఈ పోచంపల్లి మొదలు తెలియారుమాళ్లు తయారుచేసి అరబ్బు దేశాలకు ఎగుమతి చేసినారు. హఠాత్తుగా మార్కెట్ పడిపోయింది. అపుడు తెలియారుమాళ్లకు బదులు ఈ పద్ధతిలో చీరలు నేయటం మొదలు పెట్టినారు. ఈనాడు నూలు సిల్కుతో చేరలు నేస్తారు. వేలాది చేనేత పారిశ్రామికులకు ఈ పరిశ్రమ సహకారిగా ఉంది.

అట్లాగే మన రాష్ట్రంలో లేసు పరిశ్రమ గ్రామసీమలలో స్త్రీలకు ఉపాధి సౌకర్యాలు ఇస్తూఉంది. 16 లక్షల రూపాయలలేసు పశ్చిమ గోదావరి జిల్లానుంచి విదేశాలకు ఎగుమతి అవుతోంది. ఇంకా బిద్రి, హిమ్రు, ఫిలిగ్రీ ఎన్నెన్నో చేతి పరిశ్రమలున్నాయి. ఈ పరిశ్రమలకు కావలసిన నవీన పనిముట్లు, ప్రభుత్వం సప్లయ్

చేసింది. కొన్నిచోట్ల తోలుబొమ్మల పరిశ్రమకూడ ఉంది. తోలు బొమ్మలాట విద్యావ్యాప్తికి ఎంతో తోడ్పడుతుంది. కాకతీయ రాజులు పరిశ్రమను ఎంతో పోషించినారు.

చిత్తూరు జిల్లా పాపనాయుడు పేటలో మంచిరకపు నల్ల పూసలు తయారుచేస్తారు. యంత్రసామాగ్రి లేకుండా చేతితో ఇటు వంటివి తయారుచేయటం చాల గొప్పవిషయమే.

మంచి ఇత్తడి సామాను సిద్దిపేట, పెంబర్తి, అజ్జరం, కాళ హస్తి, పార్వతీపురాలలో చేస్తారు. పెరుమాళ్ల పల్లిలో ఇత్తడి విగ్రహాలుకూడ చేస్తారు.

అభిరుచులు మారినా మన సంస్కృతిని మరువరాదు. ఎంత సేపు విదేశ ఆదరణమీద ఆధారపడకూడదు. మనకార్మికుల కష్ట నిష్ఠూరాలు కనుక్కొని, వారిని ఆదరించవలసిన బాధ్యత మనపైఉంది.

మనరాష్ట్రంలో ప్రభుత్వ విక్రయ శాలలు అనేకచోట్ల ఉన్నాయి. మార్కెటింగ్ సౌకర్యాలు వీటిద్వారా ఇవ్వటం జరుగు తోంది.

మన చేతి పనులకు విదేశాలలో అనాది నుంచి గిరాకీ ఉండేది. మన దేశం సందర్శించిన యాత్రికులు వీటిని ఎంతో కొనియాడినారు. ఎరిత్రియను సముద్రానికి చెందిన పెరిప్లస్ వ్రాస్తూ మసాలియా, (మచిలీ పట్నం) లోని రంగుల బట్టలు మస్లిన్‌లు తూర్పు తీరాలకు ఎగుమతి అయ్యేవన్నాడు. ఫ్రెంచి తత్వజ్ఞుడు వాల్టేర్ (Voltare) బందరులో తయారయ్యే అద్దకాల బట్టలంటే ఫ్రెంచి వారికి ఎంతో ఇష్టమని అవి ఆదర్శప్రాయంగా ఉంటాయని అన్నాడు. మనం ఎగు మతి చేసే సరకులు చాలా మదరాసు పోర్టు నుంచి పోతూన్నాయి. ప్రతి వారు అవి ఆ ప్రాంతంలో తయారవుతున్నాయను కోవటం ఉంది. ఇకనుంచి కాకినాడ, విశాఖ పట్టణాల నుంచి ఎగుమతి చేసు కొంటే బాగుటుంది.

చేతి పరిశ్రమలు సాంస్కృతిక చిహ్నాలు మాత్రమేకాదు; వీటి వల్ల వేలాదిమందికి ఉపాధి సౌకర్యాలు కలుగుతాయి. హైదరబాద్

లో మెహస్రాంలో ఈతాకుతో బుట్టచేసి, 5,6 లక్షల రూపాయల విలువ బుట్టలు విదేశాలకు ఎగుమతి చేస్తారు. అదుంచేత, గ్రామీణ పారిశ్రామికీకరణ పథకాలలో, చేతి పరిశ్రమలకు కూడా ముఖ్య స్థానం ఇవ్వవలె. గ్రామసీమలలో లభ్యమయ్యే అనేక ముడి పదార్థాలు చేతివరిశ్రమలలో వినియోగించవచ్చు. ఇప్పటి వరకు ఉపయోగించని ఎన్నో ముడిపదార్థాలు ఉపయోగించి, సంపదగా మార్చుటమేకాక, సౌందర్యమైన చేతి వస్తువులు తయారు చేయవచ్చు. దీనితో గ్రామ సీమలలోని ప్రజలకు ఉపాధి సౌకర్యాలు కూడ ఇవ్వవచ్చు. జీవనో పాధి సౌకర్యాలు గ్రామసీమలలోనే ఉన్ననాడుఎవరు పొట్టపట్టు కొని, పట్టణాలకు రారు.

## చేనేత పరిశ్రమ

మహాత్మా గాంధి ఆంధ్రులు గురించి వ్రాస్తు "ఆంధ్రులు నన్ను మగ్దులను చేసినారు. వాళ్లు కష్టించి పనిచేస్తారు. ఆంధ్రదేశానికి ఎన్నో వనరులు ఉన్నాయి. ఉత్తమ సాహిత్య సంద ఉంది. త్యాగ శీలమూఉంది. నూలు వడకటంలోను, చేతితోనేయటంలోను ఆర్థిక అవకాశాలున్నాయి. ఒకప్పుడు ప్రసిద్ధిచెందిన రేవుపట్టణాలు కూడా ఉన్నాయి" అన్నారు. ఇప్పటికి పొంగూరులో అక్కడ లభ్యమయ్యే సున్నితమైన పత్తితో, అతి సన్నదారంతీసి, నాణ్యమైన ఖద్దరు బట్టలు నేస్తారు. ఇంత సన్న వస్త్రాలు, ఏ ఇతర రాష్ట్రలోను తయారవటంలేదు. మార్కొ పోలో (Marco Polo) కూడ దక్కను ప్రాంతం, ఓరుగల్లు ప్రాంతం చూసి "దక్కన్‌లో అతి సున్నితమైన మేలి రకం వస్త్రాలు చూసినాను. ఈ సున్నితమైన పనితనాన్ని సాలెగూటితో పోల్చవచ్చు. ఏ దేశపు రాజులైనా రాణులైనా, వీటిని సగర్వంగా ధరిస్తారు" అన్నాడు.

చేనేత వస్త్రాలు అనాదిగా మన సాంస్కృతిక వారసత్వంలో ఒక భాగంగా ఉంటూ వచ్చినాయి. మనదేశానికి ఆయా కాలాలలో విచ్చేసిన విదేశయాత్రికుల ప్రశంసలను కూడ అందుకొన్నాయి. వన్నె వన్నెల వస్త్రాల నందిస్తున్న ఈ కుటీర పరిశ్రమ, అత్యంత ప్రధానమైనదేకాక, 30 లక్షల మందికి జీవనోపాధి కూడ కల్పిస్తు న్నది. భారతదేశం, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ నూలు, పట్టు ఉన్ని

వస్త్రాల తయారీకి అనేక శతాబ్దాలుగా పేరెన్నికగన్నది. మన వస్త్రాలు, తూర్పు పడమర దేశాలకు కూడ వ్యాపించినాయి. మన రాష్ట్రంలో కుటీర పరిశ్రమలలో ఇది ప్రథమ స్థానం అలంకరిస్తుంది.

మన చేనేత పరిశ్రమ మూలస్వరూపం చెప్పటం చాలా కష్టము. పదిఎట్లున్నా అనాదినుంచి చేనేత పరిశ్రమ మన ఆర్థికవ్యవస్థలో గొప్పపాత్ర వహిస్తుంది. మన చేతి పనివాళ్ళు చక్కని రమణీయమైన చీరలు, పంచెలు, ఇతర దుస్తులు నేస్తారు. చక్కనమ్మ చిక్కినా అందమే, సన్న బట్ట చిరిగినా అందమే" అని మనవాళ్లు అంటారు.

ఆంధ్రప్రదేశంలో తయారయ్యే వస్త్రాలకు ప్రాముఖ్యం రావటానికి కేవలం అందం ఒక్కటేకాదు. చేనేత బట్ట యంత్ర సహాయం లేకుండా తయారయి చేనేత పనివాళ్ళ కళానైపుణ్యాన్ని చూపుతుంది. ఉప్పాడలోను, సిద్దిపేటలోను నేసే బూటాచీరలు, పోచంపల్లి, మంగళగిరి, చీరాల చిటికె చీరలు వేటపాలెం, నక్రకల్ లో నేసే చేతి రుమాళ్లు, సిద్దిపేట, నారాయణపేట, గుంటూరు, వెంకటగిరిలో నేసే మేలిరకపు చీరలు, మోరి, నారాయణ వనంలో నేసే సన్న ధోవతులు, ఎమ్మిగ నూరు, సికింద్రాబాదులలో నేసే రంగు బట్టలు, పెండ్యాల. గళ్లగళ్ల చొక్కా గుడ్డలు, చీరాల పేరాల ఆసియా రుమాళ్లు, జనగాం పూసల చోళీలు, వాడకందార్ల అభిమానాన్ని చూరగొన్నాయి. విదేశాలలో కూడ మెప్పు పొందినాయి.

ఆర్మూరు, గద్వాల, ధర్మవరం, పోచంపల్లిలో పట్టు బట్టలు నేస్తారు. దీనికి కావలసిన దారంలో చాల శాతం మన రాష్ట్రంలోనే తయారవుతోంది.

చేనేత పనివాళ్ళు గ్రామసీమలలో ఉన్నారు. గ్రామాలకు కావలసిన బట్టలు నేసి సరఫరా చేస్తున్నారు.

ఈ పరిశ్రమ కుటీర పరిశ్రమలలో ఉన్నత స్థానం అలంకరిస్తున్నా ప్రభుత్వం అందరు కళాకారులను సహకార క్షేత్రంలోకి తేవాలనుకొన్నా ఇప్పటివరకు చాల మంది సహకార క్షేత్రంలో

లేరు. అంతేకాదు వారికి కావలసిన దారం సరసమైన ధరలకు సప్లయ్ కావటం లేదు. చాల మంది అప్పులపాలై ఉన్నారు. ప్రభుత్వం ఈ పరిశ్రమాభివృద్ధికి తోడ్పడుతున్నారు. 25 సంవత్సరాలకు పైగా, ఈ పరిశ్రమకు ప్రభుత్వం సహాయం ఇచ్చింది. ఈ పరిశ్రమ అభివృద్ధి చేయటమే కాక, నూతన సాంకేతిక పద్ధతులు అమలు పరచవలె. గ్రామీణ పారిశ్రామికీకరణలలో, చేనేత పరిశ్రమకు ముఖ్య స్థానం ఇవ్వవలె. చేనేత కళాకారులకు, ఉపాధి సౌకర్యాలు ఎక్కువ కలగ చేయవలె. వారు మంచి మంచి బట్టలు నేస్తారంటాం. కాని వారికి రోజుకు వచ్చేకనీస వేతనం చాలా తక్కువగా ఉంది. వారి అభివృద్ధికి తోడ్పడవలసిన బాధ్యత మనపైన ఉంది.

## సిల్కు పరిశ్రమ

వ్యవసాయం మాత్రమే అందరికి ఉపాధి సౌకర్యాలు ఇవ్వ లేదని, గ్రామ సీమలలో వ్యవసాయేతర పరిశ్రమలు స్థాపించాలని, ఇది వరకే గుర్తించినాము. అంతేకాదు పండించే పంటల నమూనా లో (Pattern) తగు మార్పులు రావలె. ఎంతసేపు పత్తి, కందులు జొన్నలు అంటాం గాని ఏ యితర పంట వల్ల హెచ్చు రాబడి వస్తువులో గుర్తించం. కర్ణాటకలో $2\frac{1}{2}$ లక్ష యకరాల భూమిలో మల్‌బరీ చెట్లు పెంచి పట్టు గుడ్లకు ఆకులు మేతగా పెట్టి పట్టు కాయలు తయారు చేస్తున్నారు. ఇంత పెద్ద ఎత్తున ఏ ఇతర రాష్ట్రం లోను పని కావటం లేదు. $2\frac{1}{2}$ లక్షల ఎకరాలలో 2 లక్షల ఎక రాలు వర్షాధారం మీదే ఆధారపడుతున్నాయి. ఈ విధంగా నీటి పారుదల సౌకర్యాలు ఉంటే సాలీనా రైతులు 1 ఎకరం నుంచి 5, 6000 రూపాయలు సంపాదిస్తున్నారు. వర్షాధారం మీదే ఆధారపడితే 1200 నుండి 2000 వరకు నికరాదాయం సంపా దిస్తున్నారు. ఇంత రాబడి వ్యవసాయదారులకు ఏ ఇతర పంట నుంచి రాదు.

మన రాష్ట్రంలో కూడ కర్ణాటక పరిసర జిల్లాలలో, అంటే అనంతపురం, చిత్తూరు జిల్లాలలో 2 సంవత్సరాల క్రితం వరకు ఈ పరిశ్రమ అభివృద్ధి అయింది. కాని పట్టు కాయల నుంచి దారం

తీయటానికి అవకాశాలు లేనందు వల్ల, మన వ్యవసాయ దారులు కర్ణాటక మార్కెట్లకు పోవలసి వస్తోంది.

గ్రామీణ ఆర్థికస్థితి బాగు పరచాలంటే శిల్కు పరిశ్రమ అభి వృద్ధి చేయవలె. భారతదేశం, ప్రపంచ సిల్కు సప్లయ్‌కి 4 5 శాతం మాత్రమే తోడ్పడుతుంది. జపాన్, చైనా, రష్యా, దక్షిణ కోరియా (Japan, China, Russia, South, Korea) తరవాత భారత దేశానికి 5 వ స్థానం ఉంది. మన రాష్ట్రంలో మల్బరీ ఏ కాక, టస్సర్ సిల్కు అడవి ప్రాంత్రాలలో తయారవుతోంది. సన్నకారు వ్యవసాయ దారులకు, చిన్న వ్యవసాయ దారులకు ఇది కల్యాణ కల్పతరువు. వారికి వచ్చే సరాసరి రాబడి పెంచటమేకాక, పని అవకాశాలు లేకపోవటం, నిరంతరం పని అవకాశాలు లేకపోవటం సమస్యలు పరి ష్కారం చేస్తుంది.

మల్బరీ సిల్కుపరిశ్రమకు ముఖ్యలక్షణాలు కొన్ని ఉన్నాయి: (1) సాలీనా 5, 6 పంటలు పండించవచ్చు. కనక వ్యవసాయ దారులకు, స్వల్పకాలంలో రాబడి వస్తుంది. అప్పులపాలు కానక్కర లేదు. (2) మల్బరీ ఒకసారి పాతికా, 12, సంవత్సరాల వరకు జీవి స్తుంది. (3) స్త్రీలు కూడా పట్టు గుడ్లను పెంచటానికి వీలుంది. (4) మల్బరికి నీటి సదుపాయం అంతగా అక్కరలేదు. వర్షాధారం లేనిచోట్ల కూడా చెట్లను పెంచవచ్చు. ఎటొచ్చి పట్టు గుడ్లు పెంచు తోన్నప్పుడు, ఉష్ణోగ్రత తక్కువగా ఉండవలె. గడ్డివేసిన షెడ్‌ల మీద నీళ్లుపోస్తే ఉష్ణోగ్రత తగ్గగలదు.

భారత ప్రభుత్వం 1948 లో కేంద్రసిల్క్ (Central Silk) బోర్డ్‌ను స్థాపించింది. ఈ బోర్డు సిల్కు పరిశ్రమ సర్వతో ముఖాభి వృద్ధి తోడ్పడుతోంది.

ఈ నాడు ఈ పరిశ్రమపై 3.5 మిలియన్‌ల మంది ఆధారపడి నారు వారిలో మిలియన్‌ల వెనబడిక వారికి ఉపాధి సౌకర్యం కలుగ చేస్తోంది. సాలీనా 50 కోట్ల రూపాయల సిల్కు తయారవుతోంది. దాని ఖరీదు 80 కోట్లు కొంత మనం ఎగుమతి కూడా చేస్తున్నాము.

మల్బరీ సిల్కు పరిశ్రమ కర్ణాటక, పశ్చిమబెంగాల్, కాశ్మీర్, అస్సాం రాష్ట్రాలలో స్థిరపడిఉంది. మనదేశ స్వయం సంపూర్ణం కావాలంటే, ఇంకా గట్టిచర్యలు తీసుకోవలె. విదేశాలనుంచి సిల్కు దిగుమతి చేసుకోవలసిన అవసరంలేదు. జపాన్ నానాటికి ఈ పరిశ్రమ నుంచి తప్పుకోంటూంది. అంతర్జాతీయ, ఎఫ్. ఏఓ. రిపోర్ట్ (F. AO. Report) ప్రకారం, సిల్కుకు గిరాకి పెరెగుతోంది. చైన కోరియా తగు రీతిని ఈ ఖాళీ పూర్తిచేయటానికి ప్రయత్నం చేస్తున్నారు. మన భారతదేశంలో కూడా తగు చర్యలు తీసుకోవలె. ఎంత తొందరగా తీసుకొంటే అంత మంచిది.

కేంద్ర సిల్కుబోర్డ్ ఎంతసేపు వంశ పారంపర్యంగా వచ్చే రాష్ట్రాలమీదే ఆధారపడకుండ. ఆంధ్ర ప్రదేశ్ వంటి రాష్ట్రం, లోని వివిధ ప్రాంతాలలో మల్బరీ చెట్లు పెరుగుతాయని, పట్టు గుడ్లు పెంచవచ్చని రుజువు చేసింది. ఏటొచ్చి నీళ్లు నిలువ ఉన్న, సున్నం ఉన్న భూమి పనికిరాదు.

ఈనాడు ఆంధ్ర ప్రదేశ్‌లో సుమారు 8000 ఎకరాలు మల్బరీ కింద ఉంది. ప్రభుత్వం హైదరాబాద్, పశ్చిమ గోదావరి, కృష్ణ మొదలైన జిల్లాలలో కూడా మంచి అవకాశాలున్నాయని, ఈ ప్రాంతంలో సుమారు 1000 యకరాలు మల్బరీ సేద్యంలోకి సన్నకారు రైతులు వారి పొలాలు తెచ్చేటట్లు తగు సాంకేతిక తదితర సహాయం చేసినారు.

మల్బరీ పట్టు పరిశ్రమలో మొదటి సంవత్సరంలో 2000 ఎకరాలు మాత్రమే మిగిలినా, రెండో సంవత్సరం నుంచి 6000 నుంచి 8000 వేల రూపాయలు మిగులుతాయని, తిరుపతి వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సర్వే వల్ల తేలింది.

రాయలసీమ, సర్కారులు, తెలంగానాలో కొన్నిచోట్ల వర్షపు సౌకర్యం చాల తక్కువ. ఇప్పటివరకు మనం ఈ విషయంలో తీవ్ర చర్య తీసుకోలేక పోయినాము. ఆర్థికాభివృద్ధి లేక పోయినందువల్ల బ్రిటిష్ వారి కాలంలో రోడ్లు వేయటం మొదలు పెట్టినాము.

నిజంగా అక్కడ లభ్యమయ్యే వనరులు చాల జాగ్రత్తగా ఉప యోగించవలె. ఒక్కొక్క చాదికి 5000, లేక 6000 రూపాయలు ఖర్చుపెట్టినా పరవాలేదు. బావికి తవ్వితే అనేకమందికి ఉపాధి సౌకర్యాలు కలుగుతాయి.

ఏది ఎట్లున్నా, మన పట్టుకాయలు అమ్మకానికి బైటకు పోతున్నాయి. మన రాష్ట్రంలోనే కకూన్ మార్కెట్‌లు (Cucoon markets), సిల్కు దారం తీసే చర్ఖాలుగాని, రీలింగ్ మిషన్‌లు (Reeling machines) గాని ప్రవేశపెట్టి, ఆ దారం మన సిల్కునేత వారికి సప్లయ్ చేయవలె. మన అదృష్టవశాత్తు, మనరాష్ట్రంలో సిల్కు పారిశ్రామిక సహకార సంఘాలకు, సిల్కు దారంకావలె. అది ఇప్పుడు బయట నుంచి వస్తోంది.

ప్రభుత్వం పెద్ద ఎత్తున ఒక సమాఖ్య స్థాపించినారు. ఈ సమాఖ్య సన్నకారు రైతులకు, పరిశ్రమకు తగుసేవ చేయవలె. వ్యవసాయ దారులకు తగు సాంకేతిక సహాయం ఇవ్వవలె. కావలసిన గుడ్లు స్వల్ప కాలంలో అందచేయవలె.

ఇక సాంకేతిక పద్ధతులను గురించి ఒక మాట చెప్పడం అవసరము. విద్యుచ్ఛక్తితో నడిచే యంత్రాలు ఉపయోగించవలెనని అంటాము. కొన్ని చోట్ల వాటిని ప్రవేశ పెట్టినా మూల పడినాయి. కర్ణాటకంలో కూడ నూటికి 80 శాతం పట్టుదారం, చర్ఖా, (Silk Domestic Ruling Machines) ద్వారా చేస్తున్నారు. ఇది గ్రామీణ పరిశ్రమ అని, జపాన్‌కు భారత దేశానికి చాల తేడా ఉందని, ఈ పరిశ్రమను వికేంద్రీకరించ వలసిన ఆవశ్యకత ఉందని గ్రహించవలె. పిడుక్కి బియ్యానికి ఒకే యంత్రమని, పెద్ద యంత్రాలు, ఈ పరిశ్రమలో ప్రవేశ పెట్టినట్లయితే ఈ పరిశ్రమ అభివృద్ధికి పెద్దదెబ్బ. గ్రామీణ పారిశ్రామికీకరణలో, సిల్కు పరిశ్రమకు కూడ విస్తావ ఉంది. ఖాది కమిషన్ కూడ ఈ పరిశ్రమకు తగిన ప్రోత్సాహం ఇస్తోంది.

## టస్సార్ సిల్కు పరిశ్రమ

ఇప్పటి వరకు మల్బరీ ఆకుల మీద గదులలో బ్రతికే పురుగులను గురించి తెలుసుకొన్నాము. కాని కొన్ని పురుగులు అడవు

లలో నల్లమద్ది తదితర చెట్ల కొమ్మల మీద పెరుగుతాయి. ఇవి అడవి జాతికి చెందినవి. చైనా తరవాత భారత దేశమే టసార్ ఉత్పత్తిలో పైకి వచ్చింది. కొండ జాతుల వారు ఈ పరిశ్రమలో నిమగ్నులై ఉన్నారు. టసార్ పంట సంవత్సరంలో మూడు నాలుగు సార్లు తీయవచ్చు. ఒక పట్టు కాయనుంచి 300 గజాల దారం తీయ వచ్చు. తరవాత కూడా, ముతక దారంతీయచ్చు.

గోదావరి నది ప్రవహించే ప్రదేశం ఆదిలాబాదు నుంచి, భద్రాచలం వరకు, మన అడవులలో నల్లమద్ది చెట్లున్నాయి. ఈ ఆకులే టసార్ పురుగుల మేతకు పనికి వస్తాయి. గుడ్లు ప్రభుత్వం సరాఫరా చేస్తుంది. కొన్ని చోట్ల, అడవి జాతివారే తయారు చేసుకొంటారు. మొదటి రెండు పంటలు, విత్తనాలకు ఉపయోగిస్తారు. మూడవ పంట వాణిజ్యపు పంటగా అమ్ముకొంటారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అటవీ శాఖనల్ల మద్ది చెట్లున్న అటవీ ప్రదేశం, కొండ జాతులకు ఇచ్చినారు. భారత ప్రభుత్వం నియమించిన Tasar Silk Cammittee) ఆంధ్రప్రదేశంలోనే, అటవీ ప్రాంతాలలో నల్లమద్ది చెట్లున్నాయి. అటవీశాఖ, అడవి జాతుల కిచ్చినారని, ఆంధ్రప్రదేశ ప్రభుత్వ చర్యలు శ్లాఘనీయమని వారి రిపోర్టులో పెర్కొన్నారు. చాల కాలం వరకు ఈ పరిశ్రమ (Central Silk Board) దృష్టికి రాలేదు. ఆనాడు ఈ రచయిత (Central Silk Board) సభ్యుడుగా ఉండేవాడు. రెండవ ప్రణాళిక కాలంలో ఈ పరిశ్రమ ముందంజవేసింది 3000, 4000 అటవీ కుటుంబాలు ఈ పరిశ్రమపై ఆధారపడుతున్నారు.

ఈ పరిశ్రమ అభివృద్ధికై కూడ తీవ్ర చర్యలు తీసుకోవలె. వెనకబడిన ప్రాంతాలలో ముఖ్యంగా కొండజాతి వారికి ఈ పరిశ్రమ ఉపాధి సౌకర్యం కలుగ చేస్తుంది. ఈ పరిశ్రమ అటవీ వనరులపై ఆధారపడుతోంది. ఉపయోగింపబడని వనరులు ఉపయోగింప బడుతోన్నాయి. చెన్నూరులో (Central Silk Board) విస్తృత కేంద్రాన్ని కూడ స్థాపించినారు.

మనరాష్ట్ర గ్రామీణ పారిశ్రామికీకర పథకాలలో సిల్కు పరిశ్రమకు గొప్ప స్థానం ఉంది. ప్రభుత్వం, మల్బరీ కింద ఉన్న ఎకరాలను హెచ్చుచేయాలని ప్రయత్నం చేయాలని ప్రయత్నం చేస్తున్నారు గాని మల్బరీ పెంచి, పట్టుకాయలు తయారుచేసి, వీటిని 'నీవా నీవా' అని బయటఅమ్మి, ఆ పట్టుకాయలనుంచి తీసిన దారాన్నే మన పట్టు కేంద్రాలు కొనుక్కొంటే ఏమిలాభం లేదు. దారంతీసే కేంద్రాలు పెట్టవలె. సహకార ఉత్పత్తికి విలువఇవ్వవలె.

ప్రభుత్వం వారు కొంతమందికి మళ్లపల్లి వద్ద పొలం యిచ్చి, మల్బరీ తోటలు వేయటంలో సహాయపడి, స్వయం సహాయ పదకాలు ప్రవేశపెట్టినారు.

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం వారు కూడ ఒక సర్వేచేసి, ఏఏప్రాంతంలో అవకాశాలు ఉన్నాయి అన్న విషయంలో ఒక రిపోర్టు ఇచ్చినారు. దాని ప్రకారం మన రాష్ట్రంలో విశాఖ పట్టణం తూర్పు, పశ్చిమగోదావరులు, హైదరాబాదు, నిజామాబాదు, అదిలాబాదు, ఖమ్మం తదితర జిల్లాలలో ఈ పరిశ్రమ అభివృద్ధి అవటానికి మంచి అవకాశాలున్నాయని ఈ రిపోర్టు లో పేర్కొనడం జరిగింది.

తక్కువ పెట్టుబడితో హెచ్చు లాభాలు పొందవచ్చు సిల్కు పరిశ్రమలో సన్నకారు రైతులకు ఇదిమంచి పరిశ్రమ. ఇతరవాణిజ్య పంటలకంటే హెచ్చు నికరదాయం వస్తుంది. సంవత్సరానికి 3-5 పంటలు వస్తాయి. అప్పులకులోను కానక్కరలేదు. శిల్కు నేతగాళ్లకు మంచి వేతనాలు కూడా వస్తాయి. జపాన్ ఈ పరిశ్రమ నుంచి తప్పు కొంటుంది. శిల్కుకు గిరాకీ పెరుగుతోంది. దీని వలన విదేశ మారకం కూడ లభిస్తుంది. అందుకే, గ్రామీణ పారిశ్రామీకరణ పథకాలలో వ్యవసాయానికి సంబంధించిన ఈ పరిశ్రమకు తగిన ప్రాముఖ్యం ఇవ్వవలె.

## ఇతర బోర్డులు

కొబ్బరి తడికి పీచు పరిశ్రమలలో ఉపయోగించటానికి కాయర్ (Cori) బోర్డుకూడా ఉంది. ఆంధ్ర ప్రదేశ్‌లో తాటిపీచు విస్తారంగా

లభ్య మవుతుంది. పీచు విదేశాలకు ఎగుమతి కూడ చేస్తున్నాం. పీచు పరిశ్రమకు మంచి భవిష్యత్తుఉంది. కేరళలో 5 లక్షల కుటుంబాలకు పైగా ఈ పరిశ్రమపై ఆధారపడుతున్నాయి. పీచుపరిశ్రమ సహకార పద్ధతులలో అభివృద్ధి చేయటానికి తగు ప్రయత్నాలు జరుగుతున్నాయి. భారత ప్రభుత్వం ఈ మధ్య కుటీర గ్రామీణ పరిశ్రమలకు సహాయం చేస్తాయని ప్రకటించిన. దీనితో ఈ పరిశ్రమ అభివృద్ధి కావటానికి వీలుంది.

## చిన్నతరహ పరిశ్రమల బోర్డు

ఈ బోర్డు చాలవరకు పట్టణాలలో ఉన్న చిన్న చిన్న తరహ పరిశ్రమలకు సహాయం చేస్తోంది. పెట్టుబడి 10 లక్షలవరకు ఉన్నా అది చిన్నపరిశ్రమే అవుతుంది. గ్రామీణ పారిశ్రామిక వాడలుపెట్టి గ్రామీణ పరిశ్రమలకు కూడ ఈబోర్డు సహాయం చేస్తోంది. 1972 లో 10,550 మిలియన్ రూపాయలు పెట్టుబడి చిన్న పరిశ్రమలలో ఉండేది అది ఇప్పుడు 14,500 మిలియన్‌లకు పెరిగింది. 1.60 మిలియన్‌లు 1972 లో ఉపాధి సౌకర్యాలు పొందితే, ఇప్పుడు 2.20 మిలియన్‌లకు పెరిగింది. ఉత్పత్తి కూడ 26,000 మిలియన్‌లనుంచి, ఇప్పుడు 57,000 మిలియన్‌లకు పెరిగింది. ఎగుమతులు కూడ 3,600 మిలియన్‌ల రూపాయలనుంచి, 1975—76 లో 6000 మిలియన్ రూపాయలకు పెరిగినా. ప్రజలు క్రమేపి, వ్యవసాయేతర పనులకు పోతున్నారని అంచనా వేయబడుతోంది. ఇది శుభ సూచనే అనవచ్చు.

## చిన్న పరిశ్రమలు_గ్రామీణ పారిశ్రామికీకరణ

భారీ ఎత్తున పెట్టుబడితో నిర్వహించే వ్యవస్థలలో, ఎక్కువగా ఫ్యాక్టరీలలో పనులు కల్పించినా, చాలమందికి ఉపాధి సౌకర్యాలు కలగవని ఇదివరకే తెలుసుకొన్నాము. కుటీర పరిశ్రలను గురించి విచారించిన ఒక కుటుంబంలోనివారు, ఒక పనిలో నిమగ్నులై ఉంటే, వారు 10, 15 మందికి ఉపాధి సౌకర్యాలు ఇగవ్వలరు. ఫాక్టరీ (Factory) లో పెట్టిన పెట్టుబడితో 10 మందికి పని కలిగితే,

ఆ పెట్టుబడితో 200 మందికి పని కలిగించగలము. గ్రామీణ పారిశ్రామికీకరణలో కుటీర పరిశ్రమలు, ముఖ్యంగా గ్రామీణ పరిశ్రమలు, లాభదాయకంగా ఉంటాయి. కొన్ని చోట్ల చిన్నతరహా పరిశ్రమలుకూడ పనికి రావచ్చు.

1956 లో ప్రభుత్వం ప్రచురించిన పారిశ్రామిక తీర్మానంలో కుటీర పరిశ్రమలు అనేకమందికి ఉపాధి సౌకర్యాలు కలిగించటమే కాక, జాతీయాదాయాన్ని క్రమపద్ధతిలో పంగచలవని ప్రజలు పట్టణాలకు తరలిరారని వాటికి పెట్టుబడి అంతగా అవసరం లేదని, పేర్కొనడం జరిగింది పెట్టుబడి తప్పనిసరిగా హెచ్చుకావలసిన, ప్రాజెక్ట్లలో తప్ప, ఇతరచోట్ల చిన్న పరిశ్రమలకే ఉన్నత స్థానం ఇవ్వవలె.

అదేరంగాలలో ఉత్పత్తి అన్ని పరిశ్రమలకు కేటాయించవచ్చును. ఈ కేటాయింపులో ఉన్న వస్తువుల పెద్ద పరిశ్రమలు పోటీ చేయకూడదు. చిన్న పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలు సరసమైన రేట్లకు సరఫరా చేయవలె. పరపతి, మార్కెటింగ్ సౌకర్యాలు ఇవ్వవలె. బ్యాంకులుకూడ చిన్నపరిశ్రమలకు అప్పులు ఇవ్వవలె.

దేశంలో ఉత్పత్తి అవుతున్న 46 శాతం చేనేత పరిశ్రమ దగ్గరనుంచి వస్తోంది. మిల్లులు దీనితో పోటీచేయ నివ్వకూడదు. ఈ మధ్యనే ఖాదీగ్రామోద్యోగ కమిషన్లో మాట్లాడుతూ, భారత ప్రధాని గ్రామసీమల అభివృద్ధికి తోడ్పడమన్నారు 5 వ ప్రణాళికా ముసాయిదాలో 610 కోట్ల రూపాయలు గ్రామీణ చిన్న పరిశ్రమలకు కేటాయించబడింది. దీనిలో 216 కోట్లు చిన్న తరహా పరిశ్రమలకు 126 కోట్ల రూపాయలు పారిశ్రామిక వాడలకు 188 కోట్లు గ్రామీణ పరిశ్రమలకు, 66 కోట్లు చేనేత పరిశ్రమకు, 35 కోట్ల సిల్కుకు, 22 కోట్లు చేతి పరిశ్రమలకు 45 కోట్లు గ్రామీణ పారిశ్రామిక ప్రాజెక్ట్లకు కేటాయించడంజరిగింది. ఈమధ్యనే భారత ప్రభుత్వం యీ కేటాయింపులు పెంచినారు. చిన్న పరిశ్రమలు ఈ సదవకాశం తీసుకొని, దేశంలో ఉత్పత్తిపెంచి, ప్రజలకు ఉపాధిసౌకర్యాలు

పెంచి, నిరుద్యోగసమస్యపనురిష్కారంచేయవలె.భారత ప్రధాని గ్రామ సీమలలో అన్ని హంగులు కలుగచేయాలని. ప్రజలు పట్టణాలనుంచి గ్రామ సీమలకు పోవటానికి కుతూహలం చూపాలని, వచ్చే 10 సంవత్సరాలలో గ్రామీణ ప్రాంతాల వనరులు సరిగా ఉపయోగాన్ని నిరుద్యోగ సమస్య పరిష్కారం చేయటానికి భారతప్రభుత్వం చేపట్టిందన్నారు. ప్రజలు కూడ ఈ కార్యక్రమంలో వారి విద్యుక్త ధర్మాలు గుర్తించి, ఈ కార్యక్రమం జయప్రదం అయ్యేటట్లు చూడవలె.

గాంధీజీ సంఘంలోను, వ్యక్తిలోనుకూడ ముఖ్యమైన మార్పులు తేవాలని ఉదేశించినా సమాజ సిద్ధమైన మనుజుని సర్వతో ముఖాభివృద్ధికి తోడ్పడటం గాంధీ అభిమతం. కారల్ మార్క్స్. ఎంతసేపు ఐహికసుఖాలనుగురించి చెప్తే, గాంధీజీ మనిషి ఆత్మ కాపాడాలనేవాడు. కారల్ మార్క్సకూడా వ్యక్తి అభివృద్ధి విషయానికి ప్రాముఖ్యం ఇచ్చినాడు. కాని గాంధీజీ భారతసంఘలలో సాంఘిక విలువలున్నాయని వాటిని కాపాడాలని అనేవాడు. దీనిలో వ్యక్తికి కీలక స్థానముంది.

ఆర్థిక రాజకీయ అధికారం వికేంద్రీకరణలచేయాలని, ప్రజా ప్రభుత్వంలో వ్యక్తిగత విలువలుండాలని చెప్పినాడు. అహింసా తత్వంతో నిండిఉన్న సంఘంలో ఉత్పత్తి వికేంద్రీకరణ ఆయిన నాడే ఇది జరగగలదు. అందుచేతనే ఆయన గ్రామస్వరాజ్యం, గ్రామీణ పరిశ్రమలు అని పదే పదే చెప్పినాడు. గ్రామీణ స్వయం సంపూర్ణత అంటే ఇతరభాలతో ఎట్లాంటి సంబంధంలేక పోవటం కాదు. గ్రామీణ ప్రజలకు అధికారం ఇవ్వటం అంటే వారి వారి స్థానిక వనరులు గ్రామీణ పరిశ్రమలలో ఉపయోగించి, గ్రామాల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడటమే.

దీనినిబట్టి గ్రామసీమల, పట్టణాల, ప్రపంచ ఆర్థికవ్యవస్థలకు పరస్పర సంబంధం లేదనుకోకూడదు. స్వయం సంపూర్ణత అనే మాట, వాటికి కావాలసి అవసర వస్తువులకు అని తెలుసుకోవలె.

గ్రామసీమలు పట్టణాలతో సంబంధం పెట్టుకోకూడదంటే అది పాపమే అన్నాడుగాంధీ. సంఘాన్ని బలహీనం చేయాలనిగాంధీ ఏనాడు తలచలేదు. సాంఘికదృష్టితో చూస్తే, ఇది సంఘ ఐక్యమత్యానికి తోడ్పడుతుంది.

భారతదేశ సమరంచేస్తూ గాంధీ నిర్మాణ కార్యక్రమం కూడ ప్రసాదించినాడు. అది స్వతంత్ర భారతదేశానికికూడ వర్తిస్తుంది. ఆ నిర్మాణ కార్యక్రమంలో ఖాదీ గ్రామీణ పరిశ్రమలకు మొదటి స్థానం ఇచ్చినాడు. ఇదిభారతీయుల జీవితంలో గొప్ప మార్పు తెచ్చింది.

వేతనాలు గురించికూడ కొంచెం తెలుసుకొందాము. ఖాదీలో పనిచేసేవారికి కనీస వేతనాలు రావాలని గాంధీ మొదటినుంచి చెప్పేవారు. చర్ఖాసంఘం, దారంతీసేవారి అభివృద్ధికి ఉన్నదని, వారి ఆర్థికాభివృద్ధికి ఉన్నదని వారి ఆర్థికాభివృద్ధికి తోడ్పడాలని అనేవాడు. కనక, వేతనాలు 'మార్కెట్' దృష్టిలో పెట్టుకోకూడదు. 1935 లో అర్థ శాస్త్రవేత్తలు కనీస వేతనాల విషయంలో అంతగా పట్టించుకొన్న రోజులలో గాంధీ దాని ప్రాముఖ్యత గుర్తించినాడు. లెనిన్ కూడా, సాంఘిత ఉపయోగాలు మాత్రమే, సంఘంలోని విప్లవాలకు తోడ్పడతాయన్నాడు. గాంధేయ గ్రామీణ పరిశ్రమల ఉద్యమం ఆయన ఆర్థిక సాంఘిక అభిప్రాయాలు అమలు జరిపినాయి ఖాదీ సాంఘిక న్యాయానికి విలువలకు తోడ్పడుతుందని, సహకార పద్ధతులలో ఈ కార్యక్రమాన్ని నిర్వహించాలని, కార్యకర్తలలో పరస్పర సహకార భావం ఉండాలని ఉత్పత్తి ఉపయోగానికని, అమ్మకానికి మాత్రమే కాదని గుర్తించాలనేవాడు గాంధీ.

గాంధీ చర్ఖాకే కాక, ఇతర గ్రామీణ పరిశ్రమలకు, గ్రామసీమల అభివృద్ధికి తోడ్పడే ఇతర కార్యక్రమాలకు విలువ ఇచ్చినాడు. ఉదహరణకు పశుపోషణ విషయంలో కూడ ఎంతో కష్టపడినాడు. అనేక సంస్థలు ప్రవేశపెట్టినాడు. కాని ఆయన మరణానంతరం ఆసంస్థలు అంతగా పని చేయలేకపోయినాయి.

భారతప్రభుత్వం గ్రామీణ ఖాదీ పరిశ్రమలబోర్డు, తరవాత కమిషన్‌ను పెట్టి, జాతీయ అభివృద్ధి పథకాలలో వీటికి కూడలిస్థానం యిచ్చినారు. ప్లానింగ్ కమిషన్, చిన్నపరిశ్రమల ఉత్పత్తిలో, పెద్ద పరిశ్రమలు పోటీకుండటం, పెద్దపరిశ్రమల పరిమాణం (Size) పెరగ నీయకుండా చేయటం, పెద్ద పరిశ్రమలమీద పన్నులు (Cess) వేసి ఆ రాబడి కుట్టు పరిశ్రమల అభివృద్ధికి ఉపయోగించడం మొదలయిన విషయాలలో తగు ప్రయత్నాలు చేసినారు. ప్రతిప్రాణాళికలోను, దాని ప్రాముఖ్యత గుర్తింపబడింది. గాంధీజి కూడ దాన్ని ప్రజా రంగం (People's Sector) అన్నాడు. చాల కాలం ప్లానింగ్ కమిషన్ ఉపాధ్యక్షునిగా చేసిన డి. ఆర్. గాడ్గిల్ గ్రామీణపరిశ్రమలు చాల కాలం సంరక్షణ మీద ఆధారపడ కూడదని, సాంకేతిక విజ్ఞానం ఉపయోగించుకొని, అధికంగా మంచి పరిస్థితిలో ఉండి, గ్రామీణ పారిశ్రామికీకరణకు తోడ్పడాలన్నాడు. ఈ మధ్యనే, కార్యకర్తల సమావేశంలో భారత ప్రధాని మురార్జిదేశాయిగారు కూడ ఇదే చెప్పినారు. భారత ప్రభుత్వం, ఖాది గ్రామీణ పరిశ్రమలు ఇతర చిన్న పరిశ్రమలతో కూడ పని చేయాలని, ఇవికూడ వికేంద్రీకరణ సిద్ధాంతం మీదే పనిచేస్తున్నాయని మనం గుర్తించవలె. ఈనాడు వాటి అభివృద్ధి ప్రభుత్వబాధ్యత అయింది. కనక "ప్రభుత్వం" వాటిని ఇతర చిన్న పరిశ్రమలతో కలసి పనిచేయమంటోంది.

చాలా వికేంద్రీకరణ పరిశ్రమలలో-ముఖ్యంగా చేనేత, సిల్కు, (Coir) చేతి పరిశ్రమలలో-సరకులను విదేశాలకు ఎగుమతి జేసి, విదేశ మారకాన్ని సంపాదించి మంచి ప్రగతిని సాధించినాము. ఈనాడు చిన్న పరిశ్రమలలో 8 శాతం పెట్టుబడిఉన్నా, పెద్దపరిశ్రమలు 93 శాతం పెట్టుబడిలో ప్రజలకు ఇచ్చే ఉపాధిసౌకర్యాలలో సగానికి పైగా చిన్న పరిశ్రమలు ఇవ్వటం చాల గర్వించ దగిన విషయము.

ఏది ఎట్లున్న, ఈనాడు గ్రామీణ పారిశ్రామికీకరణ చేయా లంటే, ఉత్పత్తి మార్గాలలో మార్పులు రావలె. అంబర్ చర్ఖా ప్రవేశపెట్టడంలో, వ్యక్తి సుమారు 2,3 రుపాయలు ప్రతిరోజు సంపా దిస్తున్నాడు. ఈనాడు కుటీర పరిశ్రమలలో నిమగ్నులైన పనివా ళ్ళకు కనీసపు వేతనమేకాక, న్యాయమైన (Fair) వేతనం వస్తోంది.

(National Commission on Labour,) దానిమీద కూడ కొంత వ్రాసినారు. ఉపవృత్తులలో హెచ్చు వేతనాలు రావటానికి వీలు లేకపోయినా, రోజూ పూర్తిగా పనిచేస్తే, ఖాదీ గ్రామీణ పరిశ్రమలలో 1రూపాయినుంచి 8 రూపాయల వరకు సంపాదిస్తారు. అంతేకాక పని వాళ్ళకు సంవత్సరం పొడుగునా పని సౌకర్యాలు కలుగుతున్నాయి. ఆ సౌకర్యాలు కూడ వ్యక్తి పరిసర ప్రాంతాలలోనే దొరుకుతున్నాయి. ఇది కుటీర పరిశ్రమల ప్రాధాన్యత అని గుర్తించవలె.

మన పేదరికానికి ముఖ్యకారణాలు నిరుద్యోగం, తక్కువపని సౌకర్యము, తక్కువ వనరులు, ప్రభుత్వం వారు సంఘన్యాయ దృష్టితో, అంచనా అభివృద్ధి స్వయం ఆధారంమీద ఉండాలనే ఆశయయంతో పనిచేస్తున్నారు.

నిజంగా చూస్తే, ఖాదీ పరిశ్రమ గ్రామాల అభివృద్ధికి ఎంతో తోడ్పడగలదని, పాశ్చాత్య ఆర్థిక శాస్త్రవేత్తలే ఒప్పుకొన్నారు. దంపుడు బియ్యం పరిశ్రమ ప్రాచీన గ్రామీణ పశ్రమ. దానిని గురించి ఇదివరేకే ఒక చోట పేర్కొన్నాము. బియాన్ని మరతో తయరు చేస్తే అందులోని ఆహారపు విలువలు పోతాయంటారు. ప్రభుత్వం వారు కొత్త రైస్‌మిల్లులు (Rice mills) పెట్టటానికి అనుమతియివ్వ కూడదు 1963-64 లో 45,000 బియ్యం మరలుంటే 1971-72 లో వాటిసంఖ్య 73000 వేలకు పెరిగింది. ఇది వికేంద్రీకర గ్రామీణ పరిశ్రమ ఖాదీ కమీషన్ (Khadi Commission) కూడా 2,3 H.p. యంత్రాలు ఉపయోగించటానికి అంగీకరించినారు. వాటిలో బియ్యంనుంచి బలమైన ఆహార పదార్థాలు పోవు. ఈ చర్యవలన కనీసం వ్యక్తి రాబడి, రోజుకి 4 రూపాయలయింది. అట్లాగే చేతి కాగితాల పరిశ్రమలో గ్ర మీణ వనరులు ఉపయోగించవచ్చు. ఇక్కడ కూడ గాంధీజి, పట్టు కాగితపుగుజ్జు (Pulp) చేయిడానికి (Beaher) ఉపయోగించటానికి వప్పుకొన్నాడు. ఈ పరిశ్రమలో కూడ వ్యక్తులు రోజు 2 రూపాయల నుంచి 10 రూపాయల వరకు సంపాదిస్తున్నారు. గ్రామీణ గానుగ పరిశ్రమలో కూడ ఒక వ్యక్తి, రెండు గానుగలు నిర్వహించ గలడు. అంతేకాక, గానుగ నూనె ధరలు హెచ్చు కనక, అప్పుడు విద్యుచ్ఛక్తి ఉపయోగిస్తున్నారు. దీని వలన ఉపాధి

సౌకర్యాలు కాని, గానుగ నూనె యొక్క సహజ విలువగానిపోవటం లేదు. ఈ నాడు ఎడ్లు దొరకటం కష్టము. వాటిని పోషించడమే కష్టంగా ఉంది. గ్రామీణ చర్మ పరిశ్రమ కూడ ఎంత మందికో ఉపాధిసౌకర్యాలు కలుగ చేస్తున్నది.

గ్రామీణ పరిశ్రమల ప్రత్యేకత ఏమిటంటే, ఒక్కసారి దానిలో అడుగు పెడితే ఎవరు ఇవతలకు రారు. అంతేకాక అవి గ్రామాలలో ఉన్నాయి కనుక, వ్యక్తులు తమ ఇతర కుటుంబ వ్యవహారాలు కూడ చూసుకోవచ్చు; ఉపాధికై దూరానికి పోనక్కరలేదు.

వారికి లభించే కూలి, వేతనాలు కింద గూడా ఈ పరిశ్రమ యొక్క ఆర్థిక స్తోమతపట్టి వ్యక్తులకు వేతనాలు లభిస్తాయి. ఖాదీ కమిషన్‌వారు, పని వాళ్ళ సౌకర్యాలు ఎప్పుడూ దృష్టిలో పెట్టుకొని వ్యవరిస్తూన్నారు వ్యక్తికి లభించే వేతనాలు 1855-56 దృష్టిలో చూస్తే ఇపుడు రెట్టింపు అయినాయి. గ్రామీణ పరిశ్రమలలో, 2,3 సభ్యులు పని చేస్తారు కవక, కుటుంబ అభివృద్ధికి ఆర్థికంగా ఎంతో తోడ్పడగలరు.

ఈనాడు చాలమంది స్త్రీలు గ్రామీణ పరిశ్రమలలో నిమగ్నులై ఉన్నారు. (Women Working force ın India) లో, డి. ఆర్. గాడ్గిల్ గారు వ్యవసాయేతర గ్రామీణ పరిశ్రమలలో వారేచాలా భాగం ఉన్నారన్నాడు. ఖాదీ గ్రామీణ పరిశ్రమలలోను, చేతి పరిశ్రమలలోను సిల్కు పరిశ్రమలలోను, చేనేత పరిశ్రమలలోను, వీరు పనిచేస్తు వారి వారి కుటుంబ సంక్షేమానికి ఎంతో తోడ్పడుతున్నారు. ఇది పని వారికి ఆత్మగౌరవాన్ని ఇస్తుంది. వారి పరిసర ప్రాంతాలలో ఈ పరిశ్రమలున్నాయి గనుక, గృహ సమస్యలు అంతగా ఉండవు. స్త్రీలు కుటుంబ రాబడికి తోడ్పడితే వారికిఎంతో గౌరవం వస్తుంది. దానివల్ల వారి ఆర్థికస్తోమత కూడ పెరిగింది. ఇవి వారి ఆర్థిక సాంఘిక సమానత్వనికి తోడ్పడినాయి.

గ్రామీణ పరిశ్రమలకు గ్రామీణ జీవితానికి చాల సంబంధం ఉంది. ప్రజల సహకారం వచ్చిననాడే కుటీర పరిశ్రమల సరకులకు

గిరాకీ ఉంటుంది. ప్రజలకు వారికి కావలసిన అవసరాలగురించి మనం తెలుసుకోవలె వారిని సంతృప్తి పరచే సరకులకే సరఫరా చేయవలె. ఇది పెద్ద పరిశ్రమలలో వీలుకాదు.

అంతేకాక గ్రామీణ ప్రాంతాలలో పరిశ్రమలు నెలకొల్పితే ప్రజలకు పని ఉండి, అనవసరంగా ఒకరితో ఒకరు పోటీ పడరు. సాంఘికంగా అందరికి పని ఉన్ననాడు, కుల తత్వాలు నసిస్తాయి. అందుచేతనే చాలమంది మన సమస్యలు ఆర్థిక సంబంధమైనవి అంటారు.

గ్రామీణ ప్రాంతాల సమస్యలు, ఉపాది లేకపోవటం, తక్కువ ఉండటం, పేదరికము. పావర్టీలైన్ కింద ఉన్న ప్రజలు భారతదేశం 120 మిలియన్‌లు అంటే 41 శాతం. దీనిలో మన ఆంధ్రప్రదేశ్ ప్రజలుకూడ ఉన్నారు.

అందుచేత గ్రామీణ పారిశ్రామికీకరణ గ్రామీణ ప్రాంతాలకు సౌభాగ్యాన్ని తేవటమే కాక, పట్టణ గ్రామీణ ప్రాంతాల మధ్య ఐకమత్య భావం తెస్తోంది. దానిలో మనకు సరిపడిన సాంకేతిక విజ్ఞానం ప్రవేశ పెట్టవలె. సాంకేతిక విజ్ఞానం మనిషికిగాని, మనిషి సాంకేతిక విజ్ఞానానికి కాదని గుర్తించవలె.

# 6

# గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి పథకాలు

గ్రామసీమలలో తక్కువ ఉద్యోగ అవకాశాలు, అసలే ఉద్యోగ అవకాశాలు, లేకపోవటం పేదలకి బాధ చాల ఉన్నదని ఇది వరకే తెలుసుకొన్నాము. నిరుద్యోగ సమస్యను ప్రజలసాంఘికజీవితానికి సన్నిహిత సంబంధం ఉంది. ఆర్థికవ్యవస్థ అభివృద్ధి చెందినదన్నా, సంఘంమంచి స్థితిలో ఉన్నదన్నా సంఘంలో నిరుద్యోగ సమస్య చాలకాలం ఉండరాదు భారత సాంఘిక జీవితంలో పేదరిక బాధ అనుభవిస్తోన్నవారి సంఖ్య 218.3 మిలియన్‌లు. వారి శాతం 41.2 అని, ఇక అసలే ఏ ఉద్యోగ అవకాశాలు లేనివారు 105.57 మిలియన్‌లని అంచనాలేయ బడింది. దీనినిబట్టి ఈ సమస్య పరిష్కారం చేస్తేనేగాని దేశానికి నష్టం రాకుండా చూడటం మనకు సాధ్యంకాదని గుర్తించవలె.

ఈ పరిస్థితిలో మనమంతా కష్టపడి పనిచేయవలె. మనము తక్కువగా వనరులు సద్వినియోగం చేయవలె. సరిఅయిన ఆర్థిక సాంఘిక చర్యలు తీసికొంటే తప్పకుండా ఈసమస్యను పరిష్కార జేయవచ్చు. దీనినంతా ఒక క్రమబద్ధమైన ప్రణాళిక కింద తేవలె. అంటే గ్రామీణ పారిశ్రామీకరణ, ఒకపద్ధతి ప్రకారం చేయవలె. ఇదిప్పుడు చాల అవసరము. గ్రామసీమల ప్రజలు ఒక వ్యవసాయం మీదనే ఆధార పడలేదు. వ్యవసాయం అందరికి పనిఅవకాశాలు ఇవ్వలేదు. వారిని పరిశ్రమలలోకి మళ్ళిచటం చాల అవసరము. వారిని శాస్త్రీయ దృష్టిలోకి తేవలె. ఆనాడే పట్టణాలలోని ప్రజలవలె వారుకూడ, అభివృద్ధి కార్యక్రమాలు, అందులోని సంతులిత ఆర్థిక వ్యవస్థలోకి తేగలరు. గ్రామీణాభివృద్ధి దేశాభివృద్ధి మనదృష్టిలో పెట్టుకొని దేశాభివృద్ధిపై ఆధార పడి ఉన్న దని గుర్తించి నట్లయితే గ్రామీణ పారిశ్రామికీకరణ చాలా అవుసరమని మనకు సులభంగా తెలుస్తుంది. వ్యవసాయ కార్యక్రమాలలో కూడ పారిశ్రామిక దృష్టి తీసికోవలె. వ్యావసాయక ఆర్థిక విషయాలు పట్టణాలు,

గ్రామాలు కూడ ఎదుర్కోవలె. వ్యవసాయ రంగంలో విప్లవాత్మక మైన మార్పులు వచ్చాయని మనం గర్వ పడతాం. కాని వ్యావసాయిక పారిశ్రామిక రంగంకూడ పైకి రాకపోతే దానిలాభాలు ఏమి మనంసరిగ్గాపొందలేము.

అందుచేతనే గ్రామీణ పారిశ్రామికీ కరణ గ్రామసీమలలో సౌభాగ్యం చేకూర్చటమే కాక, గ్రామీణ, పట్టణాల రంగాలలో ఒక విధమైన ఐకమత్య భావం తెస్తుంది. సాంకేతి విజ్ఞానంలో కూడా మనం కావలసిన మార్పులు చేసుకోవచ్చు. లండన్ ఇన్‌టర్ మీడియట్ టెక్నాలజీ డెవలప్ మెంట్ (London IntermediateTechnology Development) గ్రూపు వ్యవస్థాపక డైరక్టర్, సాంఘిక (Controls) అదుపులు వికేంద్రీ కరణ చేయవచ్చని, గ్రామసీమలలో పెరుగుతున్న జనాభా సమస్యలను గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి పథకాలు, అనువైన సాంకేతిక పద్ధతులతో పరిష్కారం చేయగలవని, గ్రామీణ ప్రజలు పట్టణాలకు ఉపాధి సౌకర్యాలకు రాకుండా చేయవచ్చని గ్రామసీమ లలో కూడా పట్టణాలమాదిరి చిన్న పరిశ్రమలు నెలకొల్పి, అక్కడి ప్రజలకు కూడ అభివృద్ధి కార్యక్రమాలు అమలు జరిపితే ఎంతో బాగుంటుగన్నారు. ఆయన వెనకటి ప్లానింగ్ కమిషన్ ఉపాధ్యక్షుకు గ్రామీణ ప్రాంతాకుల తగిన సాంకేతిక విజ్ఞానావసరం గురించి ముచ్చటిస్తూ "మధ్యస్థమైన సాంకేతిక విజ్ఞానం చలన (Dynamic మైనది. పారిశ్రామికభివృద్ధి పథకాలలో దీనికి ముఖ్య స్థానం ఇవ్వాలె. అనుగుణ్యామైన సాంకేతిక విజ్ఞానంతో గ్రామీణ పారిశ్రామికీకరణ, ఆర్థిక సౌష్టవానికి తోడ్పటమేకాక నూతన సాంఘిక ప్రక్రియ (Social Process), ఉద్భవించేటట్లు చేస్తుంది. వంశపారంపర్యంగా వస్తున్న మన జీవితానికి కూడ ఒక కొత్త అర్థం వస్తుంది. పురాతన పద్ధతులు, కులభేదాలు, తదితర సాంఘిక దురలవాట్లు పోయి, భారత జాతి సంఘశాస్త్రీయ రీతిని పోతుంది" అన్నారు. ఈ మాట లలో చాల సత్యముంది. ఈ నూతన పరిణామంలో, ఖాది గ్రామీణ పరిశ్రమలకు కూడన స్థానం ఉంది. గ్రామీణ పారిశామికీకరణ కివి రామలక్షణులవలెతోడ్పడతాయి.

భారత ప్రభుత్వం కూడ చాల కాలం నుంచి గ్రామీణభివృద్ధి పథకాలకు దోహదం ఇవ్వాలని, గ్రామసీమలలో పరిశ్రమలు పెట్టి, అక్కడి ప్రజలకు పని అవకాశాలు ఇవ్వాలని గుర్తించి 5 ప్రణాళికలలోను, ఈ విషయంగురించి పేర్కొనబడింది. దురదృష్టవశాత్తు ప్రణాళికలు అమలు జరపటంలో, గ్రామసీమల ఆర్థిక సమస్యలు, పై దృష్టికి రానందున, గ్రామసీమలు వెనకపడి అక్కడి ప్రజలే పొట్ట పట్టుకొని ఉపాధి సౌకర్యాలకోసం పట్టణాలకు రావటంలో పట్టణాలపై ఒత్తిడి ఏర్పడటం జరిగింది పట్టణాలలో మురికి వాడలు పెరగటమేకాక, అనేక సాంఘిక ఆర్థిక సమస్యలు ఏర్పడినాయి. దానితో, భారత ప్రభుత్వం గ్రామసీమలలో పరిశ్రమలు నెలకొల్ప వలసినఆవశ్యకత గుర్తించింది.

## గ్రామీణ పారిశ్రామిక పథకాలు

భారత ప్రభుత్వం ఈ పథకాలు 1962-63 లో అమలు జరిపింది. ఈ కార్యక్రమం యొక్క ముఖ్యోద్దేశాలు:

(1) చిన్న పరిశ్రమలను, వ్యవసాయానికి సంబంధించిన పరిశ్రమలను, ప్రాంతీయాభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని అభివృద్ధిచేయటం.

(2) వివిధ చిన్న పరిశ్రమలలో నూతన సాంకేతిక పద్ధతులు, కార్యక్రమాలు, మొదలుపెట్టి గ్రామసీమలలో వాటిని అమలు జరిపి, గ్రామసీమల ప్రజలకు ఉపాధి సౌకర్యాలు కలిగించటం.

(3) ప్రతి ప్రాంతంలోను లభ్యమయ్యే వనరులు, ఒక కార్యక్రమం ద్వారా సద్వినియోగంచేసి కళాకారుల ఆర్థిక ప్రగతి పెంచి, వారితో చిన్న పరిశ్రమలు నడిపేటట్లుచేసి, వారి ద్వారా గ్రామసీమల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడటం.

గ్రామీణ పారిశ్రామికాకరణ ప్రాజెక్టు, ప్రాంతీయాభివృద్ధికి, తోడ్పడుతుందనవచ్చు. ఎందుచేతనంటే, గ్రామ సీమలలో పరిశ్రమలు నెలకొల్పిననాడు, గ్రామసీమంలో లభించే వనరులు, ప్రజలలో ఉన్న తెలివి. మనం సద్వినియోగం చేస్తే, ప్రాంతీయాభివృద్ధి తప్పకుండా

అవుతుంది. శతాబ్దాలనుంచి, వంశపారం పర్యంగా గ్రామసీమలలో ఉన్నా చేతిపని వారలు, వారు చేస్తున్న గృహ పరిశ్రమలు విడనాడి, మామూలుగా పట్టణాలకు తరలి రావటానికి ఇష్టపడరు. నిజంగా వారి హస్తంలో కళ ఉంది. వారి నైపుణ్యత, గ్రామసీమలలో లభ్యమయ్యే వనరులు ఉపయోగించినట్లయితే, వ్యవస్థాపకులు గా మార్చి, వారు స్వయంగా ఉద్యోగావకాశాలు తెచ్చుకొనేటట్లు చేయవచ్చు.

ఈ ఉద్దేశాలతో ఆర్థిక సాంకేతిక సర్వేలు చేసినారు. ఆ సర్వేలలో వనరులపై ఆధార పడుతోన్న పరిశ్రమలు, ప్రజల డిమాండ్ మీద ఆధారపడుతున్న పరిశ్రమలు. వనరులు, మార్కెటింగ్ సౌకర్యాలు మొదలయిన విషయాలపై మంచి సర్వేలు చేసినారు. విద్యుచ్ఛక్తి రహదారి సౌకర్యాలు, మార్కెట్ అవకాశాలు, పరిపతి సౌకర్యాలు, కావలసిన సాంకేతిక నైపుణ్యం గలవ్యక్తులు గల'' అభివృద్ధి కేంద్రాలు'' కూడా గుర్తింపబడినాయి. వీటివలన స్థానిక వనరులపై ఏ పరిశ్రమలు ఆధారపడినాయో గుర్తించి, ఎంతవరకు వికేంద్రీకరణం అవసరమో తెలుసుకొని, సంతులిత ఆర్థికవ్యవస్థకు తోడ్పడటానికి వీలుంది.

ఈ రిపోర్టులలో సూచించిన పరిశ్రమలను ఈ ప్రాజెక్ట్లలో స్థాపించినారు. సర్వేలు, (Planning) రిపోర్టు జారీ చెయ్యటంతో అయిపోదు. ఎప్పటికప్పుడు పాత పరిశ్రమలకు డిమాండ్ లేక పోవచ్చు, క్రొత్త పరిశ్రమలకు అవకాశం ఉండవచ్చు. ఈ ఆర్థిక పరిణామాలు గుర్తించటానికి, సర్వేలు, ప్లానింగ్ చాల అవసరము. ఎప్పటికప్పుడు ఏ ప్రాంతంలో ఎంతమంది చేతి పనివాళ్లు ఉన్నారు, వారికి క్రొత్త ఉపాధి సౌకర్యాలు ఎట్లా ఇవ్వగలం అనే విషయాన్ని గురించి, కావలసిన సమాచారం సేకరించవలె. అభివృద్ధి కేంద్రాలు గుర్తించటంలోను, జరిగిన కార్యక్రమాన్ని, ఫలితాలకు విలువకట్టడం (evaluation), స్థానికంగా ప్రజలు ఎదుర్కొంటున్న అనేక సమస్యలు పరిష్కారం చేయటం, ఇది ఎప్పటికప్పుడు కావలసిన విషయాలని మనం గుర్తించవలె.

భారత దేశంలో ప్రవేశపెట్టబడిన 111 ప్రాజెక్టులలోను 7 ప్రాజెక్టులు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నాయి. చిన్న పరిశ్రమల డెవలప్‌మెంట్ కమీషనర్ ఈ మధ్యనే ఫలితాలు విలువ కట్టటానికి 1975 ఒక సర్వేచేసి, ఆంధ్రప్రదేశ్‌లోని నల్లగొండ జిల్లాలోని గ్రామీణ పారిశ్రామికాభి వృద్ధి ప్రాజెక్టులకు మొదటి స్థానం లభించదని వెల్లడి చేసినారు. బ్యాంకులనుంచి పరపతి సౌకర్యాలు పొందటంలోను, గ్రామ సీమలలో వ్యవస్థాపకులను కనుక్కొని పరిశ్రమలు స్థాపించటంలోను, నల్గొండ జిల్లా మంచి ప్రగతి సాధించింది. రెండవ స్థానం కేరళ లోని అలెప్పీ (Alleppey) జిల్లాకు లభించింది. మూడవస్థానం అనంత పురం జిల్లాలోని ప్రాజెక్టులకు లభించింది. అఖిల భారత స్థాయిలో మొదటి మూడుస్థానాలలో, రెండుస్థానాలు ఆంధ్రప్రదేశ్‌కు లభించటం ఎంతో శ్లాఘించవలసిల విషయం. నల్లగొండ జిల్లాలలో పెద్దఎత్తున బ్లాక్ లెవల్ పారిశ్రామిక సహకార సంఘాన్ని కూడ ఏర్పాటు చేసినారు పశువుల పేడనుంచి (gas) చేస్తున్నారు. ఎద్దుబండ్ల అభివృద్ధి లో సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగిస్తున్నారు. నవీన శాస్త్ర సమ్మతమైన పద్ధతులు ప్రవేశ పెడుతున్నారు. గాలిలో తిరిగే చక్రాల ద్వారా పరిశ్రమలు నడిపటానికి కావలసిన శక్తి చేకూర్చటంలోను తగు ప్రయత్నాలు చేస్తున్నారు.

ఈ ఉద్యమంలో గృహ పరిశ్రమలకు చిన్న పరిశ్రమలకు మొదటి స్థానం ఇవ్వ బడింది. తరవాతా చేతిపని వాళ్ళకు నవీన శాస్త్ర సమ్మతమైన పనిముట్లు సరఫరా చేయటానికి ప్రయత్నాలు చేస్తారు. సాంకేతిక విజ్ఞానంకూడా కళాకారులకు తెలిసినదే చేస్తారు. పద్ధతి చెప్పిన అది వారికి లాభకారి ఎట్లాఅవునో విశదంగా చెప్పి, అమలు జరిపి చూపిస్తారు. స్థానికంగా లభ్యమయ్యే వనరులు నైపుణ్యం, స్థానిక పరిస్థితులు, గమనించి తగినటువంటి వికేంద్రీ కరణకు వీలైన పరిశ్రమలు స్థాపిస్తారు.

ఈ ప్రాజెక్టులు అమలుజరిపిన మొదటిరోజులలో భారత ప్రభుత్వం పరపతి సౌకర్యాలు బాగా కలగచేసినారు. 4శాతం వడ్డీ మాత్రమే పుచ్చుకొనేవారు. గ్రామీణ ప్రాంతంలో పరిశ్రమలు నెల కొల్పితే మంచిదని, దీని వలన ఆర్థికవ్యవస్థ వికేంద్రీకరణం అవు

తుందని, గ్రామసీమల ఆర్థిక పరిస్థితిమెరుగయితే, ప్రజలకు ఉపాధి సౌకర్యాలు కలుగుతాయని, ఆనాడు గ్రామీణ ప్రజలు పట్టణాలకు తరలి రారని, భారత ప్రభుత్వం ఉద్దేశము. నిజంగా పట్టణాలలో మురికివాడలకు, గ్రామాలనుంచి వచ్చినవారికి కలగచేసే ఇతర సౌకర్యాల కోసం పెడుతున్న ఖర్చులు గ్రామసీమలకే పెడితే ఎంతో బాగుంటుంది.

ఆంధ్రప్రదేశ్‌లోని 7 ప్రాజెక్టుల లోను గత 12 సంవత్సరాలలో, సుమారు 9000 మందికి, 75 లక్షల రూపాయలు మంజూరు చేసినారు. స్టేట్ బాంక్ కూడా ఉదారమైన పరపతి విధానం అమలు జరిపింది. ఇదికూడ గ్రామీణ పారిశ్రామికీకరణకు చాలా తోడ్పడుతుంది. ఎవరు హామీలేకుండా రూ. 7500 వరకు, ఒక కళాకారినికి అప్పు ఇవ్వటానికి దాని వలన అవకాశం ఉంది.

గత 5 సంవత్సరాలలో సుమారు 67 లక్షల రూపాయలు, సుమారు 7 వేల మంది గ్రామ పారిశ్రామికులకు అప్పుల కింద ఇవ్వడం జరిగింది ఒక్క నల్గొండ జిల్లాలో మాత్రమే 300 సంస్థలకు సహాయం చేయడం జరిగింది.

ఈ కార్యక్రమంలో కొత్త విషయం ఇంకోటి ఉంది: నవీన సాంకేతిక విజ్ఞానాన్ని మాత్రమేకాక, కొత్తరకపు పనిముట్లు, ఆర్థిక సహాయం మంజూరు చేయటం జరిగింది. 2000 రూపాయల ఖరీదుగల పనిముట్లు సరఫరా చేయటానికి అవకాశం ఉంది. 250 రూపాయలకు మించని ధన సహాయం కూడ దానిలో ఇమిడిఉంది. వడ్రంగులు, కమ్మరివారు, కుండలు చేసేవారు, దర్జీలు చెప్పులు కుట్టేవారు ఈ సహాయాన్ని విరివిగా పొందినారు. దానితో వీరు ఉత్పత్తి విధానంలో ఆధునిక పద్ధతులు అమలు జరిపి, ఉత్పత్తి పెంచి, వారి రాబడి హెచ్చుచేసుకొంటున్నారు. 14 లక్షల రూపాయలు ప్రభుత్వం ఈ సహాయానికి వినియోగించినారు. సుమారు 7000 మంది గ్రామీణ కళాకారులు వీటివలన బాగుపడినారు. నిజంగా చూస్తే ప్రభుత్వం అందరికి ఉద్యోగాలు ఇవ్వలేదు. ముఖ్యంగా గ్రామసీమలలోని ప్రజలకు స్వయం ఉపాధి పథకాలు చూపితే వారి దృష్టి ఉద్యోగం మీద ఉండదు.

మొదటి గ్రామీణ ప్రాంతాలలో ఉన్న పరిశ్రమలు అభివృద్ధి చేసినారు. వనరుల మీద ఆధారపడివున్న పరిశ్రమలనే, ఉన్నత స్థానం యిచ్చినారు. తరవాత ప్రజలకు కావలసిన పరిశ్రమను గురించి ఆలోచించినారు. పారిశ్రామిక వాడలలో, అక్కడ ముడి పదార్థాలు లేక పోయినా, బయట నుంచి వచ్చేటట్లు చేసి, చిన్న పారిశ్రామికులకు తగు సహాయం చేసినారు. స్థానికంగానే కాక, పరిసర ప్రాంతాలలో కూడావీటికి గిరాకీ ఉంటుంది. అస్ నూలు దారం తీసే యంత్రాలు సిల్కు రీలింగి, మంగుళూరు పెంకులు తయ్యారి మొదలయిన చిన్న పరిశ్రమలకు తగు సహాయం యిచ్చినారు.

వ్యవస్థాపకులకు కావలసినసౌకర్యాలు కూడ కలగచేయడం జరిగింది. ప్రభుత్వం వారు గ్రామసీమలకు, పరిశ్రమలశాఖ సాంకేతికనిపుణులను పంపి, ఆయా ప్రాంతాలలో ఏప వనరులు అభివృద్ధి చేసి, పరిశ్రమలలో ఉపయోగించ వచ్చునో తెలుసుకొని, పరిశ్రమలు స్థాపించాలన్న వ్యవస్థాపకులకు తగు వసతులు ఇవ్వటానికి ఎంతో తోడ్పడతారు. అంతేకాక, ప్రభుత్వం గ్రామీణ, పట్టణాలు చదువుకున్న వారు, ఉద్యోగ అవకాశాలు లేక చాల బాధ పడుతోన్నారన్న విషయాన్ని గుర్తించటమే కాక, తగు చర్యలు కూడ తీసుకొంటుంది యువకులకు ఈ విషయంలో కావలసిన ఉత్సాహం నిపుణత చూపితే వారికి తగు సహాయం చేసినా, ప్రభుత్వం ప్రవేశ పెట్టిన పథకాల ఫలితంగా మధ్యతరగతి పరిశ్రమలకు 970 లక్షల రూపాయిలు, చిన్న తరహా పరిశ్రమలకు 1424 లక్షల రూపాయల పెట్టుబడి, వ్యాపార స్థాపనలో 56 లక్షల రూపాయల పెట్టుబడి తేగలిగినారు. దీని వలన 20,000 మందికి పైగా ఉపాధి సౌకర్యాలు కలిగినాయి. ఇంత ఘనమైన పని ఏ ఇతర రాష్ట్రంలోను జరగ లేదని అఖిల భారత గ్రామీణ పారిశ్రామికీ కరణ ప్రాజెక్టుల సమావేశంలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వాన్ని కొనియాడినారు.

ఇవే కాక, ఉపాంత (Marginl) సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ వ్యవసాయ కూలీల అభ్యుదయానికి భారత ప్రభుత్వం పథకాలు ప్రవేశపెట్టింది. శ్రీకాకుళం కడప, నల్గొండ జిల్లాలలో ఈ పథకం

అమలులో ఉంది. వెనకపడినవారికి, కొత్తవిద్యలు నేర్పటం, కొత్త పరికరాలు ఉపయోగించేటట్లు చేయటం, ఉపాధిసౌకర్యాలు కల్పించటం ఈ ప్రాజెక్టుల ముఖ్య ఆశయాలు. బలహీన తెగలకు ఈ సహాయం చాలా అవసరం.

ఆంధ్రప్రదేశ్‌లో వివిధ గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి పథకాల కింద అప్పులు ఇచ్చిన వివరాలు ఈ కింద పొందు పరచడమైనది.

| పేరు. | లాభం పొందిన నంబరు. | ఇచ్చిన మొత్తం. రూపాయలలో |
|---|---|---|
| 1963-1964 నుంచి 1975-1976 వరకు | | |
| నల్గొండ | 2570 | 21,71,750 |
| అనంతపురం | 545 | 18,32,00 |
| గుంటూరు. | 150 | 14,39,350 |
| 1972 నుంచి 7975-6 వరకు | | |
| కరీంనగర్ | 1595 | 11,36,700 |
| 1972-73 నుండి 7975-6 వరకు | | |
| ఖమ్మం | 558 | 2,95,000 |
| కడప. | 378 | 2,95,000 |
| శ్రీకాకుళం | 1054 | 2,95,000 |

ఈ విధంగా రాష్ట్రాలలో క్రమపద్ధతిపై పని చేసినది ఆంధ్ర ప్రదేశ్ మాత్రమే.

బాంకులు కూడ వ్యవస్థాపకులకు ఉదార పరపతి విధానాన్ని అవలంబించి చేసిన సహాయాన్ని కింద ఇవ్వడం జరిగింది.

| 1970-1971 నుంచి 1974-1975 వరకు | లాభం పొందినవారు | యిచ్చిన మొత్తం (రూపాయలలో) |
|---|---|---|
| నల్గొండ ప్రాజెక్టు | 5 244 | 37,21,600 |
| అనంతపురం | 545 | 16,67,000 |
| గుంటూరు | 820 | 11,90,650 |

ఇవి కూడ మంచి ఫలితాలే అనవచ్చు. నవీన శాస్త్రీయమైన పనిముట్లు సరఫరా గురించిన వివరాలు కింద ఇవ్వడంజరిగింది.

| 1963-64-75-76 వరకు | నంబరు | మొత్తం రూపాయలలో |
|---|---|---|
| నల్లగొండ | 2138 | 4,08,937 |
| అనంతపురం | 2021 | 3 96,000 |
| గుంటూరు | 2282 | 3,63,000 |
| 1974-75 నుంచి 1975-76 వరకు | | |
| కరీంనగర్‌లో | 134 | 43,196 |
| 1974-75 నుంచి 1975-76 వరకు | | |
| ఖమ్మం | 482 | 55,000 |
| కడప | 256 | 54,000 |
| శ్రీకాకుళం | 467 | 55,000 |
| | 7780 | 13,75,155 |

ఇక ప్రజలకు కావలసి వస్తువుల (Demand) పట్టి ఈ కింది పరిశ్రమలు ఆయా గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి ప్రాజెక్టులలో ప్రవేశ పెట్టినారు.

నల్లగొండ : సోడియం సిలికేట్ స్ట్రాబోర్డు, గానుగచక్క (Oil cake) నుంచి సాల్వెంట్ ఎక్స్ట్రాక్షన్ (Solvent extraction), ఆధునిక రైస్‌మిల్ పోలిథీన్ సంచులు మోటారు కారుల సర్వీలు.

వనరులు ఆధారంగా చేసుకొని నెలకొల్పిన పటిష్ఠం చేసిన, పరిశ్రమల వివరాలు

| ప్రాజెక్ట్ పేరు | వ్యవసాయం మీద ఆధారపడిన పరిశ్రమలు | పశుపోషన పరిశ్రమలు | ఖనిజ సంపత్తి మీద ఆధారపడినివి | అటవీసంపదమీద ఆధారపడినవి |
|---|---|---|---|---|
| నల్గొండ | నూనెపరిశ్రమ | యముకలపొడి<br>టానింగ్ | సున్నం యిటికలు | Cane work<br>Sawmill |
| అనంతపురం | తక్కువ నంబరు ధరల, Solvent extra, నూనె గానుగలు Etc | టానింగ్<br>చెప్పులు కుట్టటం | Mosaic పెంకులు<br>ఖనిజాని పొడుం చేయటం | శీకాయపొడి,<br>Sisal Fowder |
| గుంటూరు | నూనె మిల్లులు<br>జిన్నింగు | Do | మంగుళూరు పెంకులు | Saw mill camp furniture |

ఇట్లాగే కరింనగరం, ఖమ్మం, కడప, శ్రీకాకుళం జిల్లాలలోకూడ వనరులకు అధారంగా చేసుకొని, పరిశ్రమలు నెలకొల్ప బడినాయి.

అనంతపురం : P. V. Cables, Centrefugal Pumps, Storage Batteries, సిల్కు రీలింగ్, పెయింట్స్, వార్నిషులు.

గుంటూరు : Straw Board, జిన్నింగ్, Spun Pipes, Solvent extraction

ఈ విధంగానే ఇతర గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి ప్రాజెక్ట్‌లలో తగు చర్య తీసుకోనబడింది.

ఈ ప్రాజెక్టులు, గ్రామసీమలలోని కుటీర పారిశ్రామికులకు పని అవకాశాలు కలిగించినాయని, గ్రామసీమలలోని వనరులు ఇప్పుడు సద్వినియోగం అవుతున్నాయని చెప్పవచ్చు. విద్యావంతులు తదితరులు, గ్రామసీమలలో పరిశ్రమలు స్థాపించటానికి పైకి వస్తున్నారు. వారికి తగు సదుపాయాలు కూడ ఇవ్వబడుతున్నాయి. గుంటూరు జిల్లా చిలకలూరుపేట ఇటికలు చేసేవారు, నల్గొండ జిల్లా చేనేత పారిశ్రామికులు, అనంతపురం పామిడిలో రెడిమేడ్ దుస్తులు తయారు చేసేవారు, ధర్మవరం సిల్కు పారిశ్రామికలు ఘనమైన పని చేసినారు. చాల మంది పారిశ్రామిక వాడలలో కూడ వారి వారి యూనిట్లు పెట్టుకొన్నారు. ఈ వాడలు కూడ గ్రామీణ ప్రాంతాలలో ఉన్నాయి. బాంకులు కూడ ముందంజవేసి, ఈ పథకాలు జయప్రదం కావటానికి తగు ప్రయత్నాలు చేసి, ప్రభుత్వ అధికారులతో పూర్తిగా సహకరిస్తున్నారు. అందుచేతనే, ఈప్రాజెక్ట్‌ల విషయంలో భారతదేశంలో మొదటి స్థానం ఆంధ్రప్రదేశ్‌లోని నల్లగొండ జిల్లాకు వచ్చింది. ఈజిల్లా, గ్రామీణ పారిశ్రామికీకరణ పథకాలు విజయంగా అమలు జరిపిన సుక్షేత్రమని, చేతిపనివారలకు, ఇవి సుక్షేత్రాలే కాక, ఆధునిక దేవాలయాలుగా భావించాలని అనవచ్చు.

# 7

# స్వయం ఉపాధి పథకాలు

ప్రభుత్వం, ఎన్ని అభివృద్ధి పథకాలు అమలు జరిపినా, జరుపు తున్నా, నిరుద్యోగ సమస్య తీవ్రరూపం దాల్చింది. వ్యవసాయం, అందరికి పని సౌకర్యాలు ఇవ్వలేకపోతుందని చాలమందికి సంవత్సరంలో, 100 రోజులు మాత్రమే పని అవకాశాలు ఉన్నాయని మనం తెలుసుకోవలె. ఇదికాక గ్రామాల నుంచి పట్టణాల నుంచివచ్చి చదువుకొన్నవారి సంఖ్య నానాటికి పెరుగుతోంది. కాని, వారికి ఉద్యోగ అవకాశాలు చాల తక్కువగా ఉన్నాయి. గ్రామీణ ప్రజలు కూడా గ్రామాలు విడిచిపెట్టి పట్టణాలకువచ్చి, ఉపాధి సౌకర్యాలు అపేక్షిస్తున్నారు. దానితో పట్టణాలలో లక్షలాది రూపాయలు ఖర్చుపెట్టటానికి బదులు, ఆడబ్బు గ్రామసీమలలో ఖర్చు పెట్టి, గ్రామసీమలు వాసయోగ్యంచేస్తే ప్రజలు గ్రామ సీమలలోనే ఉంటారు. భారత ప్రధాని మొరార్జి దేశాయి ఈ విషయంలో తీవ్రంగా ఆలోచిస్తున్నారు.

ఎంతసేపు ఉద్యోగం, ఉద్యోగం అని తహతహలాడిపోకుండా మనం స్వయం ఉపాధి పథకాలు చేపట్టవలె. కష్టపడి పని చేస్తే దాని లాభాలు మనమే పొందుతాము. దానితోమనకు ఆత్మగౌరవం వస్తుంది ఇంకోవ్యక్తి క్రిందపనిచేయమనక్కరలేదు. భారత ప్రభుత్వం స్థాపించిన వివిధ బోర్డులు, వికేంద్రీకరణకు, వీలైన రంగాలలో పరిశ్రమలకు దోహదమిచ్చి, హెచ్చు ఉపాధి సౌకర్యాలు ఇవ్వటంలోను, విదేశ మార్కెం లభించటంలోను, మనకళలు, సంస్కృతి పెంపొందచేయటంలోను ఎంతో తోడ్పడినాయి, వ్యక్తులు స్వయం ఉపాధి పథకాలు చేపట్టితే ప్రభుత్వానికి అంతగా ఖర్చుఅవదు. వీటితో గ్రామీణ పట్టణవ్యవస్థలలో సమైక్యత తేవచ్చు. స్వయం ఉపాధి పథకాలకు గ్రామసీమలలో తగుసహాయం చేస్తే తెలివైనవారిని గ్రామసీమలలో తగుసహాయం చేస్తే తెలివైన వారిని గ్రామసీమలలోనే ఉండేటట్లు

చేయటమేకాక, స్థానిక వనరులు కుటీర పరిశ్రమలలో ఉపయోగించి, వస్తువులుగా మార్చి. అధికోత్పత్తికి, దేశసంపదహెచ్చుచేయటంలోను ఎంతో తోడ్పడవచ్చు. నగరాలలో కలిగే ఆర్థిక సాంఘిక ఇక్కట్లు, ఉత్పత్తి కేంద్రీకరణ వల్ల వచ్చేనష్టాలు ఇవన్ని రాకుండా చేయటానికి వీలుకూడావుంది.

చదువుకొన్న వారికి, ఉపాధి సౌకర్యం ఇవ్వవలసిన సాంఘిక భద్రత ప్రభుత్వంపై ఉంది. అర్థికంగా అభివృద్ధి గాంచిన దేశాలస్థాయికి మనం సాంఘిక భద్రత ఇవ్వలేక పోవచ్చు. కాని మన ఆర్థిక స్థోమతకు సరిపడినట్లు చదువుకొన్న యువకులకు తదితరులకు చిన్న పరిశ్రమలలోగాని, వాణిజ్యంలోగాని, ఉద్యోగ అవకాశాలు ఉన్నవి. భారత జాతీయాభివృద్ధి సాంఘిక భద్రతపై అంతర్జాతీయ కార్మిక సంస్థ తరపున జరిగిన ఒక గోష్టిలో, ఉపాధి సౌకర్యాలకు పని తప్పనిసరిగా ఇవ్వటం ముఖ్యలక్ష్యాలుగా పెట్టుకోవాలని వ్యక్తి యొక్క కనీసపు కోరికలైన తీర్చాలని, నిర్ణయం తీసుకోవడం జరిగింది. గ్రామీణ ప్రజలకుకూడ సాంఘిక భద్రత ఉండాలన్నారు. 1972—1972 స్వయం ఉపాధి పథకాలు మన రాష్ట్రాలలో ప్రవేశపెట్టడం జరిగింది. 1973-1974లో $\frac{1}{2}$ మిలియన్ ఉద్యోగ అవకాశాల పథకం అమలుజరుపబడింది 19742లో ఉపాధి సౌకర్యాలు చేసేపథకం అమలుజరుపబడింది. సాంకేతిక విజ్ఞానంగల, యువకులకు పరిశ్రమలుగాని, వర్తకంగాని పెట్టుకొని స్వయం ఉపాధి కలిగించుకోవచ్చు. ప్రభుత్వ పరిశ్రమలశాఖ ఏఏ పరిశ్రమలు స్థాపిస్తే బాగుంటుందో కావలసిన ధనసహాయం ఎక్కడలభిస్తుందో మొదలయిన విషయాలలో సహాయం చేస్తుంది. పరిశ్రమలు స్థాపించాలనుకొనేవారికి నిర్వాహణ, మార్కెటింగ్ మొదలయిన విషయాలలో కూడ ప్రభుత్వ పరిశ్రమల శాఖతగు సహాయం చేస్తోంది. వీరందరికి సహాయం చేయటానికి పారిశ్రామిక సహకార సంఘాలు స్థాపించినారు. పెద్దచదువులు చదువుకొన్న వారికి, పెద్ద కార్మాగారాలలో శిక్షణయిచ్చి. అక్కడనే ఉద్యోగాలు రావటానికి ప్రభుత్వంకూడ ప్రయత్నం చేసింది.

పరిశ్రమలకు కావలసిన యంత్రసామగ్రి చిన్న పరిశ్రమల కార్పొరేషన్ ద్వారా లభిస్తోంది. స్వయం ఉపాధి పారిశ్రామిక వాడలు కూడ స్థాపించ బడినాయి. అభివృద్ధి కేంద్రాలలో ఉపాధి సౌకర్యం కలిగించే పరిశ్రమలు స్థాపించబడినాయి. ఇంజనీరింగ్ వస్తువులు, రసాయన వస్తువులు, తోలు వస్తువులెన్నో వీరు తయారు చేస్తున్నారు. కొంతమంది యువకులు బట్టల దుకాణాలు, బియ్యం మిల్లులు, లాండ్రీలు పెట్టుకొన్నారు. కొంతమంది మందుల కార్ఖానాలు కూడ పెట్టుకొన్నారు. చదువుకొన్న వారికేకాక, కుటీరపారిశ్రామికులకు కూడ తగుసహాయం లభించింది. ఆర్థికంగా, సాంఘికంగా వెనకబడినవారు వారిలో ఎందరో ఉన్నారు. రాష్ట్రమంతటా యీపథకం అమలు జరుపబడింది.

ఇంటువంటి పథకాలు అమలుజరుపాలంటే ముఖ్యంగా కావలసినది పెట్టుబడి. బ్యాంకులు ముందంజవేసి ధనసహాయంచేయటం ఎంచతగిన విషయం ఇచ్చిన అప్పులు తిరిగి వాపసు తీసి కోవటానికి ప్రభుత్వపరిశ్రమలశాఖ, బ్యాంకులకు తగుసహాయం చేస్తుంది. ప్రభుత్వం, ఈ పథకాలలో ఎంతో శ్రద్ధ చూపుతోంది. దానికి కారణం, యువకులకు పని అవకాశాలు రావటమేకాక, వారు ఉత్పత్తి కూడ పెంచగలరు. అంతేకాక వారిని నిరుద్యోగం అనే పిశాచి బాధనుంచి తప్పించి, సంఘానికి వారు ఉపయోగించేవారిగా చేయగలం. వారికి కావలసిన విద్యుచ్ఛక్తి, వారుతయారుచేసిన వస్తువును వీలైనచోట ప్రభుత్వం కొంటోంది. స్వయం ఉపాధి పథకాలు అమలుజరపటంలో ఆంధ్రప్రదేశ్‌కి, భారతదేశంలో రెండోస్థానం యివ్వబడింది. ఆంధ్రప్రదేశం ఈ విషయంలో చూపుతున్న శ్రద్ధను, ఇతర రాష్ట్రాలవారు ఎందరో కొనియాడినారు.

స్వయం ఉపాధి పథకాలు జయప్రదంగా జరిపితే, నిరుద్యోగులకు ఎంతో లాభం కలుగుతుంది. యువకులకు దీనిలో ఇష్టముందో ఆయా పరిశ్రమలో తగు శిక్షణయిచ్చి, ఆయాపరిశ్రమలు స్థాపించటానికి ప్రభుత్వం అన్ని విధాలా సహాయం చేస్తోంది. గ్రామసీమలలో విద్యుచ్ఛక్తి ఉంటే ఎన్నో పరిశ్రమలు అక్కడ నెలకొల్పవచ్చు.

కుటీర పారిశ్రామికులకు, మంచి పనిముట్లు కొనుకోటానికి ముడిపదార్థాలకు, 1000 రూ పాయల వరకు ధన సహాయం చేస్తున్నారు. వారు కూడ ఉద్యోగాలమీద మోజుపడకుండ, గ్రామసీమ సీమలలో స్థిర నివాసం చేసుకోటానికి ఇవి ఎంతో తోడ్పడినాయి.

ఇప్పటి వరకు మనరాష్ట్రం 574 రూపాయలు ప్లానింగ్ కమిషన్‌నుంచి వచ్చింది. 1977-78 లో 126 లక్షల రూపాయలు ఈ రాష్ట్రానికి యివ్వమని మన ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వాన్ని కోరింది. ఈ పథకాలనుంచి వచ్చిన లాభాలు గురించికూడ కొంత తెలుసుకొందాం 10000 యూనిట్లు, ఈ నాడు ఈ పథకాల కిందపనిచేస్తున్నాయి. 40,000 మందికి స్వయం ఉపాధి సౌకర్యం కలిగింది. 3000 గ్రామీణ కుటీర పారిశ్రామిలకు ధనసహాయం ఇవ్వ బడింది, స్త్రీలకు కుట్టుయంత్రాలు ఇచ్చినారు కొంతమంది స్త్రీలు, అనంతపురం తదితర జిల్లాలలోని గ్రామసీమలలో. రోజుకి 10 రూ, యలకు పైగా సంపాదిస్తున్నారు.

చాలమంది ఒక విషయం మాత్రంచెప్తారు. పట్టణాల లోనే చాల డబ్బు ఖర్చయిందని, కాని దీనివల్ల ఏమిమించి పోలేదు. ఇక ముందు చాల డబ్బు గ్రామసీమలలో ఖర్చుపెట్టవచ్చు. జాతీయం చేయబడినకొన్ని బ్యాంకులు,పాడిపరిశ్రమలకు, కోళ్లు, పందులు పెంపకానికి ఎంతోధనం ఇచ్చినారు. దానితో గ్రామీణ ఆర్థికవ్యవస్థ ఎంతో బాగుపడింది.

గ్రామసీమలకు కావలసిన విషయాలు మనంగుర్తించి, వనరులు మీద ఆధారపడే పరిశ్రమలు గ్రామసీమలలో ప్రవేశపెట్టవలె. గ్రామీణ బ్యాంకులు తగు సౌకర్యాలు ఇవ్వగలవు. సిల్కు పరిశ్రమలో కూడ స్వయం ఉపాధి పథకాలు కొంత వరకు మంచి ఫలితాలు ఇచ్చినాయి. మన యువకులు, "ఉద్యోగం ఉద్యోగం," అని తహతహ లాడకూడదు. వెనకబడిన తరగతుల అభివృద్ధికై ఏర్పాటు చేయబడిన సహకార కార్పొరేషన్ కూడ ఈ విషయంలో ఎంతో సేవచేసింది. తోళ్ల పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్ కూడ చర్మకారులకును, పెద్ద ఎత్తున సహాయం చేసింది.

30-4-1977 వరకు, 9902 యూనిట్లను ప్రవేశ పెట్టారు. సుమారు 40 వేలకు స్వయం ఉపాధి సౌకర్యం వచ్చింది. కింద యిచ్చిన పట్టాలో పూర్తి వివరాలు ఇచ్చినాము.

| పథకం వివరం | యూనిట్ల సంఖ్య | ఉపాధి సౌకర్యాలు పొందిన వారి సంఖ్య |
|---|---|---|
| (1) కనీసం పెట్టుబడిపథకము లేకపోతే బ్యాంకు అప్పు ఇవ్వదు. | 7568 | 31, 531 |
| (2) సాంకేతిక సహాకార సంఘాలు స్థాపన | 93 | 3590 |
| (3) కమిషన్ ఏజంట్లు | 6 | 14 |
| (4) మార్కెటింగ్ సంఘాలు | 9 | 30 |
| (5) కుటీర పారిశ్రామి కులకు సహాయం | 2221 | 2221 |
| (6) వస్తువులు బట్వాడా సంఘాలు | 5 | 63 |
| (7) ఉపాధి సౌకర్యాలకు గ్రాంటులు | — | 1223 |
| (8) సహాకార సంఘాలకు మేనేజర్లుగా నియ మించే పథకం | — | 12 |
| | 9902 | 38,684 |

గ్రామ స్థాయిలోను, బ్లాకుస్థాయిలోను జిల్లా స్థాయిలోను వనరులను బట్టి, ఈ పథకాలు అమలు జరిపితే, ఇవి ఎంతో ఫల వంతం కాగలవు. వనరులు గురించి, మార్కెటింగ్ సౌకర్యాలు

గురించి తగు ఆర్థిక సర్వేలుచేసి, వాటిని ఆధారంగా చేసుకొని మనం సలహాలు ఇవ్వాలిగాని ఇష్టం వచ్చినట్లు ఇవ్వరాదు. స్వయం ఉపాధి పథకాలు జయప్రదం కావాలంటే, ఉత్సాహవంతులకు తగు వసతులు ఇవ్వవలె. ఈ కార్యక్రమాన్ని, సాంఘిక భద్రత కార్య క్రమంగా భావించవలె. అందుచేతనే, ఈ నాడు భారత ప్రభుత్వం, ఈ ముఖ్య విషయాన్ని గుర్తించి 1977-78 బడ్జెట్‌లో గ్రామ సీమల అభివృద్ధికి, ఇది వరకు ఎన్నడు కేటాయించని డబ్బు కేటా యించినారు. ఇది చాల గొప్ప విషయం. ప్రజలు కూడ ఈ విష యాన్ని గుర్తించి, గ్రామీణాభివృద్ధి పథకాలు, స్వయం ఉపాధి పథకాలు జయప్రదంగా జరిగేటట్లు చేయవలె. ఆనాడే నిరుద్యోగ సమస్య, పేదరికం మనదేశం నుంచి తరిమి వేయగలం. ఇది ఎంత మాత్రం కష్టం కాదు.

# 8

# ఉపసంహారము

గ్రామీణ పారిశ్రామికీకరణకు పెద్ద పరిశ్రమలకే అంటి పెట్టుకోకూడదు. పెద్ద పరిశ్రమలకు ఏదో చేస్తున్నాంగదా! గ్రామీణ పరిశ్రమలకు ఏదో చేద్దాము. వాటి కళ్ల నీళ్లు తుడుద్దామనే ఉద్దేశంతో ఈ పని తలపెట్టకూడదు. ఇప్పటి వరకు వ్రాసిన దానిని బట్టి పాతదానిని మరువకూడదు. దానినిలోని మంచిని ఆధునిక యుగంలో తీసుకొందాం. భవిషత్‌లో ఇప్పటి విషయాలు మరువరాదు. అంటే, పాతకాని ఆధునిక యుగానికి గాని భవిషత్ లేదా మూడో ప్రపంచం అనండి వీట న్నిటికి సన్నిహిత సంబంధం ఉంది. గ్రామీణ పారిశ్రామికీకరణ మాత్రమే, గ్రామసీమలలోని ప్రజల పేదరిక బాధ పోగొట్టు తుందని లోకనాథన్ (Dr. P. S. Lokanadhan) గారు చెప్పిన మాట లలో చాలసత్యముంది. గ్రామీణ ప్రజలు వారి క్షేత్రాలలోనే ఉండి, స్థానిక వనరులు ఉపయోగించుకొంటూ జీవిత కాలక్షేపం చేయ వచ్చు. గ్రామాల ప్రజలలోని శక్తి ఈ మార్గంద్వారానే విరివిగా ఉపయోగించుకో వచ్చు. స్థానిక ప్రజల కోరికలు కూడ తీర్చవచ్చు. సంఘంలోని రాబడులలో అంత వ్యత్యాసాలు కూడ ఉండవు. ధనం కూడా కొద్ది చేతులలోనే ఉండదు. ప్రజలకు కావలసిన అవసరపు వస్తువులను గ్రామసీమలలోనే తయారుచేసుకోవచ్చు. ఈనాడు పెరుగుతోన్న జనాభావలన కలిగే నిరుద్యోగ సమస్య పరిష్కారం చేయటానికి, వేరే ఇంకో మార్గంలేదు. గ్రామసీమలలోని ప్రజలు విపరీత పేదరిక బాధలో పుట్టి, పెరిగి మరణిస్తున్నారు. వారి సమస్య ఇప్పటికైనపరిష్కారం చేద్దాము.

గ్రామసీమల చుట్టుగాని, పరిసర ప్రాంతాలలోగాని, కొత్త సాంకేతిక విజ్ఞానంలో గ్రామీణ చిన్న పరిశ్రమలు నెలకొల్పినట్లయితే గ్రామాల ఆర్థిక సాంఘిక సమస్యలు పరిష్కారం చేయటం చాల సులభము. ఈ యుగంలోని ప్రజలేకాక ముందుయుగాలజనం కూడ

దాని వలన లాభం పొందుతారు. పరిశ్రమలు, గ్రామీణ ప్రజల అందుబాటులో ఉన్నప్పుడు, యంత్రాలు అంటే అతనికి భయం పోతుంది. యంత్రాలకు స్నేహితుడవుతాడు. తన లాభానికి, సంఘం లాభానికి వాటిని ఉపయోగించుకొంటాడు.

దేశంలోని సాంఘిక ఆర్థికాభివృద్ధికి, సంతులిత వృద్ధికీ సమ వృద్ధికావలె. దానితో సంఘంలోని వివిధ గ్రూపులు, ప్రాంతాలు అందరు బాగుపడతారు. కనక వ్యవస్థ భారతజాతి ఔన్న త్యానికి తోడ్పడింది. భవిషత్‌లో కూడ యీ వ్యవస్థ, చాల ప్రయో జనకారి కాగలదు. అభివృద్ధి కార్యక్రమాలు, సాంకేతిక విజ్ఞానం ఒక పద్ధతి ప్రకారం గ్రామసీమలకు వర్తింపచేస్తే అనతికాలంలో నూతన ఆర్థిక ప్రగతికి మార్గం చూపగలం. ఒక క్రమరూపమైన పారిశ్రామికీకరణ పద్ధతిని, గ్రామీణ పారిశ్రామికీకరణ పునాది అంటే అతిశయోక్తి కానేరదు. ఇది జయప్రదం కావలంటే కొన్ని చర్యలు తీసుకోవలె.

(1) వికేంద్రీకృతమైన పారిశ్రామిక ప్రక్రియలు సమన్వయం (Co-ordination) చాల అవసరము. గ్రామసీమ అభివృద్ధి కార్య క్రమాలలో అనధికార సంస్థల సహకారం హెచ్చు అపేక్షించవలె.

(2) తయారైన సరకులకు, సాధ్యమైనంత వరకు, మార్కె ట్లు స్థానింగా గాని పరిసర ప్రాంతాలలో గాని ఉండవలె. దానితో రాహదారి ఖర్చు అంతగా ఉండదు.

(3) గ్రామీణ పారిశ్రామిక వాడలలోని చిన్న పరిశ్రమలు, ఇతర గ్రామీణ పరిశ్రమలతో పోటీచేయ నివ్వకూడదు.

(4) వంశ పారంపర్యంగా వచ్చే సాంకేతిక విజ్ఞానం, పద్ధతు లు ఇందుకు పనికిరావని విస్మరించరాదు. కాని పాతది కొత్తదానితో సమన్వయం చేయటం కష్టసాధ్యంకాదు. స్థానిక వనరులు, పద్ధతులు, మనుజసంపద జయప్రదంగా ఉపయోగించుకోడానికి మంచి పద్ధతులు ప్రవేశ పెట్టడంలో తప్పేమిలేదు.

(5) స్థానికంగా కావనసి పెట్టుబడి లభ్యమయేటట్లు చేసుకోవలె.

(6) కావలసిన ముడిపదార్థాలు సమకూర్చుకొని, సంవత్సరం పొడుగునా న్యాయమైన ధరలకు దొరికేటట్లు చేయవలె.

(7) సాధ్యమైనంత వరకు సహకార పద్ధతులను మనం అభిమానించవలె.

ప్రభుత్వ సహకారం, సహాయం లేనిదే గ్రామీణ పారిశ్రామికీకరణ పథకాలు జయప్రదం కానేరవు. ముడి పదార్థాల సరఫరా, ధరల నిర్ణయం, పోటీనుంచి కాపాడటం. ఇవన్నీ ప్రభుత్వం మాత్రమే చేయగలదు. గ్రామీణ పరిశ్రమలకు హెచ్చు అవకాశాలు ఇచ్చి, అవి తయారుచేసిన వస్తువులు ప్రభుత్వం పోషించడమే కాక, పెద్ద తదితర పరిశ్రమల పోటీనుంచి రక్షించవలె. అమ్మకపు పన్ను మొదలగు పన్నుల భారం కూడ తగ్గించవలె. గ్రామసీమలలో, ఆర్థిక సాంఘిక మార్పు రావాలంటాం. ఇవన్ని చేస్తే, అనతికాలంలో గ్రామసీమలలో, శాంతియుక్త విప్లవం రాగలదు. ఇట్లాంటి విప్లవం రావాలంటే సంఘంలోని అన్నిభాగాలు ఈవిప్లవం రావటానికి తోడ్పడవలె. ప్రజలు, ప్రభుత్వం, కళాకారులు ఈ ఉద్యమంలో ఉన్న వివిధ సంస్థలు కలసి పని చేయవలె. ఒకరినొకరు పెడర్థం చేసికోకూడదు. పెద్ద పరిశ్రమలు, చిన్న పరిశ్రమలు, చిన్న పరిశ్రమలలో, గ్రామీణ పరిశ్రమలు, తదితర పరిశ్రమల బాధ్యతలు ప్రభుత్వం భాగించవలె. గాంధేయ సిద్ధాంతాల ప్రకారం ఇది చాల అవసరం.

గాంధీజీ ఈ విషయంలో మనకు అనేక విషయాలు చెప్పడమేకాక, తాను అధ్యక్షునిగాని ఉన్న గ్రామోద్యోగ సంఘం ద్వారా అనేక మరువరాని విషయాలు చెప్పినాడు ఏ నాడు గ్రామీణ పారిశ్రామికీకరణ పథకాలు, క్రమబద్ధంగా అమలు జరుపుతామో అనాడే గ్రామాల్లో నిజమైన స్వరాజ్యం ఉంటుంది. పేదరిక బాధ భయం పోతుంది. నిరుద్యోగ సమస్యఅనేదే ఉండదు.

# అనుబంధం-A

గ్రామాల అభివృద్ధి, గ్రామీణ పారిశ్రామికీకరణ గురించి, ఈ చిన్నపుస్తకంలో గాంధీజీ మనస్తత్వం గురించి వ్రాసినా, యీ విషయంలో కొన్ని ముఖ్య గాంధేయ సూక్తులు పొందు పరచటం మంచిదనిపించి, వాటిని ఈ అనుబంధంలో ఇవ్వడమైనది.

'భారతదేశం, కొద్ది పట్టణాలు కాదు, 7 లక్షల గ్రామాలలో వుంది. గ్రామ సీమలలోని ప్రజలకు, తగిన సౌకర్యాలైనా ఉన్నాయా లేవా అనేవిషయాన్ని పట్టణాలలోని వారం ఇప్పటివరకు తలవనే లేదు. గ్రామ సీమలలో కనీస సౌకర్యాలుకూడ లేవు. బ్రిటీషువారు పట్టణాల ద్వారా దోచుకొంటే, పట్టణాలవారు గ్రామ సీమలను దోచుకొంటున్నారు. గ్రామ సీమల అభివృద్ధికి తోడ్పడటమే మన స్వరాజ్యధ్యేయం. గ్రామసీమలను ఆధారంగా పెట్టుకొని నిర్మించవలె. లేకపోతే అసౌధం అనతి కాలంలో కూలిపోతుంది''

(హరిజన్ 4-4. 36 స్వరాజ్య 323 పేజి హరిజన్ 9-10-1937 నుండి క్రోడీకరింపబడింది)

## మనిషి - యంత్రము

మనం మనిషికి, ముఖ్యమైనవిలువ ఇవ్వవలె యంత్రం మనిషిని బానిసగా చేయకూడదు. యంత్రాలు నశించినా, మనం విచారించ నక్కరలేదు. ఆనాడు ఒకరినొకరు దోచుకోరు. చేతి పరిశ్రమలకు ఏ హాని జరుగదు. పనిచేసే కార్మికులకు ఏమీ భయం లేదు. నాకు దానిమీద నమ్మకంఉంది. నమ్మకమే మనల్ని ముందుకు తీసుకొని పోతుంది. యంత్రాల మూలంగానే పట్టణాలు వచ్చినాయి. నాకు యంత్రాలంటే యిష్టం లేకపోవడం కాదు. వాటిపై మోజు పోవాలని నా అభిలాష. వేలాదికి ఉపాధి సౌకర్యాలు లేకపోతే యంత్రాలు, మనుషులను పనినుంచి తప్పిస్తున్నాయి. కొద్దిమంది ఉపయోగార్థమే యంత్రాలు సహాయకారి అయితే, లేదా చాలమందికి ఉపాధిసౌకర్యాలు తొలగిస్తే, ఆ యంత్రాంగం అంటే నాకు ఎటువంటి సదాలోచన లేదు. చాలమంది మనుషులు, లేకపోతే యంత్రాల అవసరం

కాని, గ్రామసీమల ప్రజలు ఆకలి బాధతో మలమల మాడుతోంటే, యంత్రాలు అంటే, అవి పనికిరావని చెప్పవచ్చు. పెద్దఎత్తున పరిశ్రమలు ప్రభుత్వం నడిపించినా, దానికి విలువ లేదు. యంత్రాలు, మనుషుల పని అవకాశాలు తీసివేస్తే, దానికి నేను వ్యతిరేకుణ్ణి. పెద్దఎత్తునఉత్పత్తి అంటే, గ్రామసీమల కళాకారుల ఇంట్లో ఉత్పత్తి అనవలె.

మనం కార్మికులకు ఉన్నతస్థానం ఇవ్వవలె. యంత్రాగాన్ని దోచుకోటానికి ఉపయోగించకూడదు.

యంత్రాలకు ఒక స్థానం ఉంది. కాని అవి కార్మికుల పని అవకాశాలు తొలగించ కూడదు. గృహాలలో ఉపయోగించే చిన్న యంత్రాలంటే నాకు వ్యతిరేకత లేదు. శాస్త్రంలో కొత్త సాంకేతిక పద్ధతులు వస్తే, వాటిని అందరి అభివృద్ధికి ఉపయోగించవలె.

ఈ యుగాన్ని యంత్రయుగం అంటారు. మన అర్థిక వ్యవస్థ యంత్రాలచే పరిపాలింప బడుతోంది గనక. 1908 ముందు నుంచి నేను యంత్రాలకు వ్యతిరేకుడనై ఉన్నాను. యంత్రం దోచుకొన చేయగలిగిన దెయం మానవుడు అభివృద్ధి అవాలన్నా, సమత్వం సోదరత్వం రావాలన్నా ("Ruskin Unto the Last") లో వ్రాసిన మాటలు గుర్తించవలె.

[Young India 13-11-1924, Harijan 30-11-35, Harijan 29-8-1936, Hind Swaraj 26 పేజి, Harijan 28-6-1935 Harijan 15-9-1946 Harijan 2-11-1934 Harijan 22-5-1935 Harijan 25-8-1946 నుంచి ఈ అభిప్రాయాలు క్రోడికరించడం జరిగింది.

## దారిద్ర్యం - ధనికత్వం

మహాత్మగాంధి ప్రకారం, పేదవారిని దోచుకొని, ధనికులు కావటానికి, ధనికులను దోచుకొని పేదవారు ధనికులు కావటానికి జరగని కాలం రాగలదని బాపూజీ ఘంటా పథంగా చెప్పినాడు ఎంత సంపూర్ణ ప్రపంచం లోనైనా ఆర్థిక అసమానత్వం పూర్తిగా పోక పోయినా, ఒకరికే ఇంకొకరికి మధ్య, ద్వేష ముండరాదన్నాడు గాంధీ

పెద్ద పెద్ద భవనాలు డబ్బు లేని వారిని దోచుకొని కట్ట బడినాయన్నాడు. ధనికులు పేద వారి యోగ క్షేమం సర్వదా కోరాలన్నాడు.

అందరి ప్రజల సంక్షేమం కోరాలని, అందరు కష్టపడి పని చేయాలని, నూలు దారం చర్ఖాతో తీయటంలో గాని, ఇతర కష్ట పడి పనిచేయటంలో గాని నిమ్మగ్నులై ఉండాలన్నాడు. కష్టపడక పోతే వ్యక్తికి భోజనం చేసే అర్హత లేదన్నాడు. "బట్టలేని వారికి బట్టలు ఇవ్వరాదు. పని ఇవ్వాలి" అన్నాడు. పని వాళ్ళ మీద ఆధారపడకూడదని స్వావలంబన పద్ధతి అవలంబించాలన్నాడు.

"దరిద్ర నారాయణుడు, పేద వారి దేవుడు. ఆకలి బాధతో, మల మల లాడుతున్న ప్రజలకు ఆహారం చాల అవసరం. అదే వారి దేవుడు'' అన్నాడు బాపూజీ ఇంకొకచోట ''నేను స్వరాజ్య సంపాద నకు పాటు పడుతోన్నాను. నిరుద్యోగంతో బాధపడుతున్న మిలియన్‌ల ప్రజలకు, ఒక్కసారైన అన్నం రావటానికి పాటు పడుతున్న వారికై నేను పాటుపడుతున్నాను'' అన్నాడు.

[Young India 7-10-26, Dt. 28-4-78, Harijan 22-2-42 Young India 13-8-25, Young India 5-5-27 Young India 29-3-1931 నుంచి సంక్షేపించడం జరిగింది.]

## భారతదేశ కర్తవ్యము

భారతదేశం బలహీనమైనదేశం కనక అహింసా తత్వం పాటించ మనటంలేదు. భారతదేశం ఎల్లప్పుడు శాంతి పద్ధతినే అవ లంబించవలె. ఇదే న్యాయమైన మార్గం. అమేరికా, ఇంగ్లాడ్ అవలంబించే పద్ధతులు మనకు కూడా మంచివని తలచ వద్దు. హింసా మార్గాలకు పోవద్దు. అభివృద్ధిని, తళుకుతో పోల్చవద్దు. స్వాతంత్ర్యం వచ్చినాక కూడ, మనం విదేశాల అధికారం చూసి భయపడ నక్కరలేదు. అహింసా తత్వమే, రక్తపాతం లేకుండా మనకు స్వరా జ్యం తెచ్చింది. ఆయుధ సామాగ్రి లేకుండా స్వాతంత్ర్యాన్ని అహింసా పద్ధతుతో నిలబెట్టుకోవలె. ఆయుధ సామాగ్రి మీద అన

వసరంగా ఆధారపడకూడదు. అది మనదేశాన్ని నశింపచేస్తుంది'' అన్నాడు గాంధీజీ. ప్రపంచ అభివృద్ధికి భారతదేశం చేయగలిగింది. ఇదే అన్నాడు.

[Young India 11-8-1920 Dt 20-5-1926 Dt. 2-8-1926 Harijan 14-4-1946 Harijan 21-4-1946 Harijan 31-8-1947 Harijan 14-12-1947 న గాంధీజీ వ్యాసాల నుంచి క్రోడీకరించడంజరిగింది.

## సమగ్రహ గ్రామసేవ - గాంధీజీ అభిప్రాయాలు

నిజమయిన భారతతేశం 7 లక్షుల గ్రామసీమలలో ఉంది. ప్రపంచాభివృద్ధికి, భారతదేశం తోడ్పడాలంటే, జీవచ్ఛవాలుగా ఉన్న గ్రామసీమలలోని ప్రజలు జీవించేటట్లు మనం చేయవలె.

గ్రామసీమలలోని ప్రజలు, వారి అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొనరు. ఆరోగ్యం విషయంలో అసలు లక్ష్యపెట్టరు. ప్రజల సమస్యలు పరిష్కారం చేసేటప్పుడు, ఓర్పు చాల అవసరం. పర్వతాల వంటి కష్టాలున్నా ఓర్పుతో వాటిని జయించగలం.

చదుకొన్నవారు గ్రామసీమల అభివృద్ధిని గురించి పట్టించుకోరు. సేవయే పరమ ధర్మంగా పెట్టుకొన్నవారే సేవాధర్మమే మాత్రధర్మమని, గ్రామసీమల అభివృద్ధికి తోడ్పడవలె. అప్పుడు వారు ఎటువంటి నిరుత్సాహం పొందరు.

గ్రామసీమల ప్రజలలో జీవించటంలో ఎన్నో గుణపాఠాలు నేర్పుతుంది. గ్రామసీమలు, ధనార్జన దృష్టితో చూస్తే ఏమీ లాభం లేదు. గ్రామసీమలు, మనకు కావలసిన సౌకర్యాలు ఇవ్వలేక పోవచ్చు. కాని కొంతకాలం, ప్రజలతో కలసి పనిచేస్తే ఎంతో సంతోషం ఇస్తుంది.

వీరికి కావలసిన సమగ్ర గ్రామసేవ చేయవలె. గ్రామసీమలలో నవీనత తేవటమేకాక, పిల్లల చదువుకు కూడ తోడ్పడవలె. నూలు

దారం చేయటం కూడ చేర్చవలె. గ్రామాల సర్వతో ముఖాభివృద్ధికి సర్వదా తోడ్పడవలె.

గ్రామసీమలలో ఆర్థిక సర్వేలు చేసి స్థానికంగా లభ్యమయ్యే, ఏ వనరులు స్థానికంగా ఉపయోగించవచ్చునో తెలుసుకోవలె. నూనె గానుగలు, దంపుడు బియ్యం, తాటి బెల్లం, తేనే, బొమ్మలు, చాపలు, చేతికాగితాలు, గ్రామీణసబ్బులు, చర్మపరిశ్రమ ఇంకా ఎన్నెన్నో గ్రామీణ పరిశ్రమలు అభివృద్ధి చేయటానికి వీలుంది. గ్రామసీమలకు కావలసిన వస్తువులేకాక పట్టణాలకు కావలసిన వస్తువులు కూడ తయారు చేయవచ్చు.

## గ్రామీణ కళలు, పరిశ్రమలు

బయట సులభంగా విక్రయం చేయకలిగే సరకులనే గ్రామ సీమలలో తయారుచేయవలె. గ్రామసీమలలో లేని సౌకర్యాలు లేవు. ఉన్న సాంకేతిక విజ్ఞానాన్ని, సరిగ్గా ఉపయోగించుకోవలె. ఈ విధంగా గ్రామసీమలను అభివృద్ధి చేస్తే అవి తోటలు అవుతాయి. తాత్కాలికంగానే కాక, శాశ్వత పద్ధతి ప్రకారం గ్రామసీమలను అభివృద్ధి చేద్దాము.

## ఆర్థిక పునర్నిర్మాణము

నేను వ్రాసే పరికరాలు 100 శాతం స్వదేశీయాలయి ఉన్నాయి. గ్రామసీమలో దంపుడుబియ్యం పరిశ్రమ వికేంద్రీకరణ పద్ధతులు అనుసరించి, కుటీర పరిశ్రమగా అభివృద్ధిచేసిన, గ్రామీణ పేదప్రజలకు, ఉపాధి సౌకర్యాలు కలుగుతాయి. ప్రజలకు శ్రేష్టమైన ఆరోగ్య కరమైన దంపుడుబియ్యం లభ్యమవుతాయి. మిల్లులలో తయారయిన (Polished) బియ్యంలో ఏ సత్తువా లేదు. చూడటానికి బాగా ఉంటాయి. ఇది మోసమని మనం గుర్తించవలె. ప్రజాభిప్రాయం బాగా ఉంటే, బియ్యం మరలు పెట్టటానికి సాధ్యం కాదు. ఆధునిక బియ్యపు మరల వలన గ్రామాలలోని ప్రజలకు ఉపాధి సౌకర్యాలు పోతున్నాయి. దేశంలోని ప్రజల ఆరోగ్యం నాశనమవుతుంది.

గ్రామసీమలు స్వయం సంపూర్ణంగా ఉండవలె. గ్రామాలలో యంత్రాలు నిర్మించుకొని, వాటిని ప్రజల ఉపయోగార్థం ఉపయోగించుకొంటే ఏమీ తప్పులేదు. అవి ఇతరులను దోచుకోటానికి దారి తీయకూడదు.

యంత్రాగార నాగరికతపై అహింసాతత్వం నిర్మించలేము. గ్రామీణ ఆర్థికవ్యవస్థ యొక్క ముఖ్యలక్షణం-దోపిడి లేకపోవటం. అహింసా సిద్ధాంతం యొక్క మూల తత్వం ఇదే.

ఈ నాడు పట్టణాలు గ్రామసీమలను దోచుకొంటున్నాయి. నిజమయిన స్వరాజ్యంలో, గ్రామాలకు తగు స్థానం ఇవ్వవలె.

గ్రామసీమలకు విద్యుచ్ఛక్తిలభ్యంఅయ్యేటట్లు చేస్తే, గ్రామీణ కళాకారులుదీ నిని ఉపయోగించవచ్చు. కాని ఇది గ్రామసీమలలో ఉద్యోగ అవకాశాలు పెంచవలె. గ్రామీణ పరిశ్రమలకు ఇది తోడ్పడవలె. కొన్ని గ్రామాలలో పిండి మరలు పెట్టడం వల్ల ఎక్కడ చూసినా శబ్దం వినిపిస్తుంది.

| | | |
|---|---|---|
| ఆధారం : | హరిజన్ | 27- 4-1947 |
| | Do | 16- 5-1936 |
| | Do | 20- 2-1937 |
| | Do | 17- 3-1946 |
| | Do | 25- 4-1946 |
| | Do | 10-11-1946 |
| | Do | 26-10-1934 |
| | Do | 29- 8- 36 |
| | Do | 4-11- 38 |
| | Do | 20- 1- 40 |
| | Do | 15- 2- 35 |
| | Do | 2- 2-6-35 |
| | Do | 10- 3- 46 |

గాంధీజీ అభిప్రాయాలు చదివితే, అవి అమలు పరచటం సులభమని, గాంధీ ఎన్నడు అభివృద్ధి మార్గాలకు వ్యతిరేకత చూప లేదని తెలుస్తుంది. ఆయన ముఖోద్దేశం, స్థానికంగా లభించే వనరులు ఉపయోగించి, వికేంద్రీకరణ పద్ధతులు అవలంబించి, గ్రామసీమల ప్రజలకు తగు ఉపాధి సౌకర్యాలు ఇవ్వాలని, వారు పొట్టపట్టుకొని పట్టణాలకువస్తే దేశానికి కూడా లేనినష్టం వస్తుందన్నారు. భారత ప్రభుత్వం కూడా ఈ విధంగానే ఆలోచించి సత్వర చర్యలు తీసికొనటం సంతోషించవలసిన విషయము.

# అనుబంధము-B

## భారతప్రభుత్వ నూతన పారిశ్రామిక విధానము.

భారత ప్రధాని మొరార్జిదేశాయి, భారత ప్రభుత్వ పారిశ్రామిక విధానంగురించి చెబుతూ, పెద్ద పరిశ్రమలు ప్రభుత్వం విడనాడదని, గ్రామసీమలలో గ్రామీణ పరిశ్రమలు పెట్టటంలో, ఆధునిక పారిశ్రామిక విధానాన్ని విడనాడటంగాని, ప్రపంచంలోని ఇతర ప్రాంతాలతో సంబంధాలు తెంపుకోటంగాని జరగదన్నారు. ఆధునిక విజ్ఞానం యొక్క లాభాలు గ్రామసీమలలోని ప్రజలు పొందాలని భారత ప్రభుత్వ ముఖ్యోద్దేశం. పెద్ద పరిశ్రమలు అవసమురన్నచోట హెచ్చు చేస్తామని, గ్రామసీమలలో చిన్నచిన్న పరిశ్రమలలో చిన్న యంత్రాల లాభాలు పొందవచ్చునని కూడ భారత ప్రధాని ఈ మధ్యనే చెప్పినారు.

చిన్న పరిశ్రమలు, పెద్ద పరిశ్రమలు మధ్య ఎటువంటి వివాదములేదు. రెంటిని సమన్వయం చేసి, పెద్ద పరిశ్రమలు చిన్నవాటి పై పోటీకి పోకుండా చేయావలె. చిన్నపరిశ్రమలు, పెద్దపరిశ్రమలు సరిఅయిన అభివృద్ధికి వ్యతిరేక భావం చూపరాదు.

భారత ప్రభుత్వం నూతన పారిశ్రామిక విధానం చిన్నపరిశ్రమలకు ఎంతో దోహదం యిస్తోంది. చాల వస్తువులు చిన్నపరిశ్రమల వారు ఉత్పత్తి చేయటానికి అవకాశం వచ్చింది. ఇది వరకు 180 ఉంటే ఇప్పుడు 504కు పెంచబడింది, కాని సబ్బులు, టూత్ బ్రష్‌లు, అగ్గిపెట్టెలు, పెద్ద పరిశ్రమలు చేయనిచ్చినారు; వారి పోటీకి చిన్నపరిశ్రమలు ఆగలేవు. చిన్నపరిశ్రమలు కూడ నాణ్యమైన వస్తువులు చేయవలె.

ఇక ముందు పరిశ్రమలు గ్రామసీమలకు తరలించటానికి కూడ ప్రయత్నాలు జరుగుతున్నాయి. దాని ముఖ్యోద్దేశం గ్రామీణ ప్రాంతాల వారికి, ఉపాధి సౌకర్యం అక్కడే కలిగించి, వారు పట్టణాలకు తరలిరాకుండా చేయటమే ప్రభుత్వ రంగంలో పరిశ్రమలకు

కూడ ప్రభుత్వం చేయూతనిచ్చి, అవి ప్రజలకుఉపకారిగా ఉండు నట్లు చేయటం ప్రభుత్వ ముఖ్యోద్దేశం.

పెద్దపరిశ్రమలు ఉత్పత్తి పెంచటానికి ప్రభుత్వం అంగీక రించదని, చిన్నపరిశ్రమల రంగంలో ఆయా వస్తువులు ఉత్పత్తి చేయ కలిగితే, వారికే ప్రత్యేక సౌకర్యాలు ఇవ్వబడతాయని ప్రభుత్వం స్పష్టం చేసింది. చీరలు, ధోవతులు, చేనేత మగ్గాల రంగానికి యివ్వాలని ప్రభుత్వం నిర్ణయించింది.

భారత ప్రభుత్వం వ్యవసాయానికి ప్రాముఖ్యం ఇస్తుందితప్ప నిసరి. పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలు వ్యవసాయరంగం నుంచే వస్తున్నాయి. నిరుద్యోగసమస్య పరిష్కారం చేయాలంటే, గ్రామసీమలలోను స్వయంఉపాధి పథకాలు అమలుజరపవలె. చిన్న పరిశ్రమలకు గొప్ప విలువ ఇచ్చి, వాటిని, పెద్ద పరిశ్రమల పోటీ నుంచి రక్షించటానికి ప్రభుత్వం సిద్ధంగాఉన్నారు. చిన్న చిన్న యంత్రాలు సరఫరాచేసి కావలసిన నిధులు సమకూర్చి, మార్కెటింగ్ సౌకర్యాలు ఇస్తే చిన్న పరిశ్రమలకు గొప్ప భవిష్యత్తుఉంది.

భారత పారిశ్రమిక మంత్రి జార్జి ఫెర్నాండిస్ కూడ, చేతి పరి శ్రమలకు గొప్ప ప్రాఖ్యం ఉన్నదని ఉత్పత్తిదారులకు సరిఅయిన వేతనాలు ఇవ్వాలని, ఇప్పుడు వారికి లభించటం లేదని, వినియోగ శక్తి అందరికి ఉండాలని చెప్పినారు. భారతదేశంలో, మొదటి సారిగా సమన్వయ పారిశ్రామిక పద్ధతి ప్రవేశపెట్ట నున్నారు.

ఎన్నోసారులు భారత ప్రధాని గ్రామీణ పరిశ్రమలు, నిరు ద్యోగ సమస్య పరిష్కారం చేయగలదన్నారు. 5 ప్రణాళికలు అమలుజరుపుతున్నా నూటికి 70 మంది పేదరికబాధలో వుండడం భరింపరానిదని, మనం స్వయం శక్తి మీద ఆధార పడాలని చెప్పి నారు. భారత ప్రభుత్వ నూతన పారిశ్రామిక విధానాన్ని అమలుజరపాలంటే ప్రజలు కూడా చేయూతనివ్వవలె. మనం ఉత్పత్తి పెంచటమే కాదు, ప్రజలకు ఉపాధి సౌకర్యాలు

కలగ చేయవలె. పెరుగుతున్న జనాభాను అరికట్టటమేకాక, పెరుగుతోన్న నిరుద్యోగ సమస్య పరిష్కారం చేయవలె. మనకు పెట్టుబడి సౌకర్యాలు అంతగా లేవు; వనరులు బాగా ఉన్నాయి. వాటిని ఉపయోగించవలె.

షుమేకర్ (Schumakcher) అనే ఆర్థిక శాస్త్రవేత్త పశ్చిమ దేశాల ఆర్థిక సిద్ధాంతాలు భారతదేశం, గుడ్డిగా అవలంబించ రాదని, గాంధేయ మార్గాన్ని అవలంబించాలని, గాంధేయ మార్గాన్ని చైనాలో అవలంబిస్తోన్నారని వస్తువుల ఉత్పత్తి పెద్ద ఎత్తున చేసిన మాత్రాన్నే మన సమస్యలు పరిష్కారం కావని, ఉత్పత్తి సామాన్య ప్రజలకు అని మనం గుర్తించవలెనని అభిప్రాయపడినాడు.

సాంకేతిక విజ్ఞానాన్ని, పెట్టుబడి దార్లను చిన్న పరిశ్రమలలో ఉపయోగించవలె. స్థానికంగా లభించే వనరులు ఉపయోగించవలె. డబ్బుఖర్చు పెట్టిన మాత్రంతోనే సమస్యలు పష్కారం కావు. గ్రామీణ పారిశ్రామికీకరణ చేయటంలో ఇప్పుడు స్థాపించే జిల్లా పారిశ్రామిక కేంద్రాలు ఎంతో తోడ్పడగలవు. మొత్తంమీద భారత ప్రభుత్వ నూతన పారిశ్రమ విధానం దేశాభివృద్ధికి - ముఖ్యంగా గ్రామాల అభివృద్ధికి, గ్రామీణపారిశ్రామికీకరణకు ఎంతో-తోడ్పడ గలదు.

ఏది ఎట్లున్నా, దేశంలో నానాటికి నిరుద్యోగ సమస్య తీవ్ర రూపం దాలుస్తోంది. ఈ సమస్య పరిష్కారం చేయాలంటే పెద్ద పరిశ్రమలు మనకు అంతగా ఉపయోగించవు. కనక మనం పరిశ్రమలను వికేంద్రీకరణం చేసి, వాటిని గ్రామసీమలకు తరలించవలె. అంతేకాదు. గ్రామసీమలలో చిన్న పరిశ్రమలు పెట్టిననాడు అక్కడి ముడి పదార్థాలు, ఇతర వనరులు ఉపయోగించిన నాడు గ్రామీణ ప్రజలకు ఉపాధి సౌకార్యాలు అక్కడేఏర్పడతాయి. దానితో వారు పొట్ట పట్టుకొని పట్టణాలకు రారు. గ్రామీణప్రాంతాలలో విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కూడా ఉన్నందున కుటీర పరిశ్రమలలో చిన్నయంత్రాలు ఉయోగించి, ఉపాధి సౌకర్యాలు పెంచటంలో తప్పులేదు, పని సౌకర్యాలు పెంచటంలో తప్పులేదు. పనిసౌకర్యాలు తక్కువ చేయ

కుండా చిన్న యంత్రాలు ఉపయోగిస్తే తనకు ఎటువంటి అభ్యంతరం లేదన్నాడు గాంధీజీ.

ఆరవ ప్రణాళికా ముసాయిదాలో గ్రామీణాభివృద్ధికి గొప్ప స్థానం ఇవ్వడం జరిగింది. గ్రామాలు అభివృద్ధి కావాలన్నా, పెరుగుతోన్న నిరుద్యోగ సమస్యను పరిష్కారం కావాలన్నా, గ్రామీణ ప్రాంతాలలో లభ్యమవుతున్న ముడిపదార్థాలు, వనరులు ఉపయోగించి, ప్రజలకు ఉపాధి సౌకర్యాలు కలిగించటం చాల అవసరము. ఈ విషయంలో మన ఆర్థిక శాస్త్రవేత్తలు, శాస్త్రజ్ఞులు, ప్రభుత్వం తగు చర్యలు తీసుకోవలె. శాస్త్రవిజ్ఞానం సామాన్య ప్రజల లాభానికి అని మనం గుర్తించవలె ప్రణాళికల లాభం గ్రామసీమల ప్రజలు పొందవలె. కాని పట్టణాలలోని కొద్దిమంది మాత్రమే ఈ లాభాలు అనుభవించరాదు.

# SELECT BIBLIOGRAPHY


Bhattacharya : East India Company and Economy of Bengal Inrae and Co, London.

F. Buchanan : An Account of the Districts of Bihar and Patna (1811 - 22) Bihar and Patna Research Society.

A.K. Coomaraswami : The Indian Craftsmen. Probstain and Co., London.

R.C. Datta : Economic History of India Publications Division.

M.K. Gandhi : Khadi Why and How (Navjivan)

J.B. Kripalani : Gandhian Thought (Orient Longmans)

J.C. Kumarappa : Economics of Permanence
Why the Village Movement

R.V. Rao : Cottage and Small Scale Industries and Rural Economy 1967 sterling
Handicrafts of India (Book lovers)
Handicrafts of A.P. (Andhra Saraswata Parishad)
Gandhian Contribution to Indian Economy (Mysore University)
"Sevagram" (Sevagram Ashram Pratistan)

Publications Division.. : Industrial Wealth and Prospects in A.P.
Rural Industrialisation
Sericulture in Andhra Pradesh
Handicrafts (Concept Publishing Co.) of India

## REPORTS AND REFERENCES


Annual Reports of Various Boards
Report of the Khadi Evaluation Committee 1960
Karve Committee Report 1961
Publications of Small Scale Industries Board
5 Year Plans of Planning Commission
Publications of Central Silk Board
All India Handicrafts Board etc.
Publications on Handicrafts, issued by Department of Industries, Government of Andhra Pradesh
Publications on Handloom Industry, issued by Department of Handlooms, Government of Andhra Pradesh
Reports and other Publications issued by Publications Division, Government of India
Back Numbers of Andhra Pradesh in Telugu and English (Issued by Information Department Government of Andhra Pradesh)
Vigyana Sarvaswamu Issued by Sahitya Akademi, Hyderabad